శివరావు, దిగవల్లి.

పోతన వేమనలయుగము / గ్రంథకర్త దిగవల్లి వేంకటశివరావు.- బెజవాడ : శారదా భాండార ముద్రాశాల, 1924.

ii, 65, (3) p. ;18 cm.

Record no. 723

Śivarāvu, Digavalli.

Pōtana Vēmanalayugamu / granthakarta Digavalli Vēṅkaṭaśivarāvu.- Bejavāḍa : Śāradā Bhāṇḍāra Mudrāśāla, 1924.

ii, 65, (3) p. ;18 cm.

Record no. 723

గ్రంథకర్త [illegible]
[illegible]
13.2.24

ఆంధ్రవాఙ్మయయుగములు.

# పోతనవేమనలయుగము.

చెన్నపురి రాజధాని కళాశాలవారి

**1922 సంవత్సరపు పవెల్ అండ్ మోర్ హెడ్**

బహుమానము (రు 150 లు) పొందిన

ఆంధ్రవ్యాసము.


## దిగవల్లి వేంకటశివరావు, బి.ఏ., బి.ఎల్.,

విజ్ఞానచంద్రికవారి దక్షిణాఫ్రికా చరిత్ర,

గ్రంథకర్త.



శారదా భాండార ముద్రాశాల, బెజవాడ.

ముద్రితము.

1924.

సర్వస్వామ్య సంకలితము.] [వెల రు. 0-8-0.

## అంకితము.

బ్రహ్మశ్రీ॥ మ॥రా॥రా॥శ్రీ ఆంధ్రవాల్మీకి,

వావిలికొలను సుబ్బారావు పంతులుగారికి.



## విషయవిభాగము.

# పోతనవేమనలయుగము.



భాషాభివృద్ధికి దేశాభివృద్ధి మూలకారణము. అందువలనను వాఙ్మయచారిత్రము దేశచారిత్రమునుబట్టి యుండును. దేశమునందలి, ఆయాకాలముల రాజకీయసాంఘికమతస్థితి, ఆయాకాలపు వాఙ్మయమునందు ప్రతిబింబితమగుచుండును. జనుల యభిప్రాయములు, భావములు, చేష్టలు నాగరీకము ను వాఙ్మయమునఁ గలపాత్రములలో కనబడుచుండును. ఒక కాలమున బాగుగనున్న సంగతు లింకొక కాలమున బాగుగనుండవు. ఒకకాలమున భూషింపఁబడునాచార మింకొక కాలమున దూషింపఁబడును. దీనికిఁగారణము ప్రజలయభిప్రాయములు మారుచుండుటయే.

మనదేశమున కవులు రాజుల యాశ్రయమునుండి వారి విభవము ననుభవించుచు, కృతులు చెప్పుచుండిరి. అందు తమకిష్టమగు సంగతులను పొగడుచు తమకనిష్టమగువానిని నిరసించుచు విమర్శించుచుండిరి. కవులను పోషించుటయు, వారిచే కృతులందుటయు నొకగౌరవముగ మనరాజులును సామంతులు నెంచుచుండిరి. కవులఘంటపుఁబోటులకు రాజాధిరాజులును వెఱచుచుండిరి. ఆకాలపుస్థితి శ్రీనాథుని చారి

త్రమువలన మనకు బాగుగ తెలియుచున్నది. ఆయన కాలమునాటి రాజులనుగూర్చి వారిప్రజలనుగూర్చి, మతములనుగూర్చి వారితో కలసిమెలసియుండి గౌరవింపఁబడిన శ్రీనాథుఁడు తనకృతులలో బాగుగవర్ణించినాఁడు. ఇట్లే తక్కిన కవులును తమప్రబంధములలో తమకాలపుస్థితిని వెల్లడించినారు.

రాజకీయ పరివర్తనములనడుమ, సాంఘికాందోళనములలో, ఆచారవ్యవహారములు కలతఁజెందినకాలమున భిన్నమతములు విజృంభించినకాలమున, మానవులకు శాంతిని శ్రేయమునుకలిగించు భక్తియోగమును బోధించి కలతనుదీర్చి, సర్వజనులకును సమ్మతమును శుభదాయకమునగు దైవభక్తిని ప్రేమమయుఁడగు శ్రీకృష్ణుని చారిత్రమువలన కలిగించిన పరమభాగవతోత్తముఁడు, శ్రీమదాంధ్ర మహాభాగవతమును మనకొసంగి కృతార్థుఁడైన మహాపురుషుఁడు, పోతన. ఈకవి చాలదారిద్ర్యము ననుభవించెను. తనచుట్టును తనకన్న చిన్నలు కాని, సాధారణకవులు రాజులనుకొలిచి వారినిపొగడి వారివలన ధనమునుగొని సుఖించుట నితఁడు చూచినాఁడు. కాని, ఇతనిమనసు తిరుగలేదు. ఇతనికాలపుస్థితిగతులు బాగుగలేవు. తుచ్ఛసుఖములకితఁడాసఁజెందలేదు. ఐహికసుఖములరోసి వానినిఖండించెను. ఇతఁడుతనకాలపు



రాజులను 'మనుజేశ్వరాధము'లనుచున్నాఁడు. వారివలనకొన్ని సొమ్ములు, పురములు, వాహనములు పుచ్చుకొని నరకమునబడి పోవుటకిచ్చగింపక, స్వార్థపరత్వముమాని పరమార్థ చింతనముతో భాగవతమును రచియించి రామునకంకితముచేసి జన్మముసఫలము చేసికొనెను.

ఇఁక వేమన యన్ననో చాల తెలివిగలవాఁడు. చదువుకొనినవాఁడు; మంచి కుటుంబములోనివాఁడు. అతఁడు జ్ఞాని యోగి. ఇతనికి హేమకారవిద్య తెలియునని పలువురితని నాశ్రయించి తిరుగుచుండిరి కాని, ఇతఁడు వారి సాహాయ్యము నపేక్షింపక, భోగములను త్యజించి, ఊరూరఁ దిరుగుచు, ధనము నార్జించుపనిమాని తత్వజ్ఞానము నుపదేశించుచు, తాను చూచిన ఆచారవ్యవహారములను విమర్శించుచు, నీతులను బోధించుచు, స్వార్థత్యాగము చేసెను.

పోతనకాలము పదునైదవ శతాబ్దియని నిర్వివాదాంశము అయినను, ఇతఁడే ప్రదేశమున జన్మించెను, ఎచ్చటనుండెను, ఎచ్చట నాంధ్ర భాగవతమును రచించె నన్నవిషయము తగవులకు చోటిచ్చినది. ఆయన 'ఏకశిలానగర'మని చెప్పినాడు. ఇది ఓరుగల్లా? ఒంటిమెట్టయా? ఇందు రెండు కక్షలవారు బయలుదేరి తగవులాడిరి. ఈ తగవులతో మనకుఁబనిలేదు. ఆకాలమున నీ రెండుచోటులను గల రాజకీయ సాంఘికమత

స్థితులు తెలిసికొనినచో మనకు శ్రేయస్కరము ఇంక వేమన కాలమునుగూర్చి మొన్న మొన్నటివఱకును పలువురు పలు విధములుగ తలచిరి. కొందఱు పదునేడవ శతాబ్దమనిరి కొందఱు పదునాఱనిరి, కొందఱు పదియనిరి! ఈమధ్య వంగూరి సుబ్బారావుగారు "వేమన"అను విమర్శ గ్రంథ మొకటివ్రాసినారు. అది ఇప్పుడె ప్రకటింపబడినది. ఇదియుగాక, వారీమధ్య నొక వ్యాసమును పత్రికలలో ప్రకటించినారు. కొన్ని కారణములను చూపుచు వారు వేమన 1412 లో పుట్టి 1480 వఱకును జీవించెనని సహేతుకముగ నిర్ణయించినారు అతండు కొండవీడులో పుట్టి గండికోట మొదలగుస్థలములలో పెరిగి కటారు పల్లెలో చనిపోయెననియు, ఊరూరందిరుగుచు నాంధ్రదేశమెల్ల సంచరించినటుల వ్రాసినారు. వేమన పద్యములలో నొక ప్రతిలోని పద్యమున పేర్కొనబడిన శైవగురువులలో సోమశేఖర పండితుండితనిగురువట. ఇతండు పోతన్నగారికింగూడ గురువట. వేమన చిత్రపట మొకటి దొరికినటుల కూడ వ్రాసినారు ఈపరిశోధనమె నిజమయ్యేనేని, ఆంధ్రవాఙ్మయ చారిత్రమున నొకగొప్ప విశేషము బయల్పడినట్టు సంతసింపవలసినదె. ఈవ్యాసములో కాలనిర్ణయవిచారము చేయుటకెడము లేకపోవుట నింతటితో విరమించి కథాంశమునకు రావలెను. పెద్దలు పూజ్యులునగు, ఈకాలపు పండితులు,



తథితర పరిశోధకులు, నీవిషయములను చర్చించి, విమర్శించి నిర్ణయించువఱకును, ప్రస్తుతము చేయంబడిన సిద్ధాంతమును నమ్మి, పోతనయు వేమనయు నించుమించుగ నొకేకాలమున పదునైదవ శతాబ్దమున నుండిరని తలచి ఆకాలమునాటి ఆంధ్రదేశపు రాజకీయస్థితియు, సాంఘికస్థితియు నెట్లులుండెనో అవి పోతనవేమనల కృతులం దెంతవఱకు నాదర్శితములయ్యెనో పరిశీలించి కృతివిమర్శనకు వత్తము.

## దక్షిణ హిందూదేశస్థితి.

తురుష్కులు దండయాత్రలు సెలుపుటకుమున్ను దక్షిణ హిందూదేశమున మూడు స్వతంత్ర రాజ్యములుండెడివి. అందు మొదటిది సేవుణరాజ్యము. దీని రాజధాని దేవగిరి. ఇది మహారాష్ట్ర దేశముననుంటచే మహారాష్ట్ర సామ్రాజ్యమని వ్యవహరింపఁబడెను. రెండవది కాకతీయ సామ్రాజ్యము. దీని రాజధాని ఓరుగల్లు. ఇది ఆంధ్రదేశముననుంటవలన దీని నాంధ్రసామ్రాజ్యమనిరి. మూడవది హొయిసల సామ్రాజ్యము. దీనిరాజధాని ద్వారసముద్రము. తురుష్కుల దండయాత్రలవలన నీమూడు రాజ్యములును గ్రమముగనస్తమించినవి. తూర్పు తెలుంగు దేశముయొక్క ముఖ్యపట్టణమగు నోరుగల్లును మహమ్మదీయులు 1323లో వశముచేసుకొనిరి. ద్వారసముద్రమును 1327లో వశముచేసుకొనిరి. మహమ్మదీయులవాతి కెదిర్చి నిలిచి హిందూభాషా ధనమును నిలుపు

టకు సంగనురాజపుత్రులగు ఐదుగురన్నదమ్ములు పాటుపడిరి. వీరే నూత్నకర్నాటక సామ్రాజ్య స్థాపకుల మూలపురుషులు. విన్సెంటు స్మిత్తుగారి ఆక్సుఫర్డు హిందూదేశచరిత్ర.

"ఆంధ్రనగరమున జరిగిన ఘోరసంగ్రామములలో నోరుగంటి ప్రతాపరుద్రుడు ఢిల్లీచక్రవర్తిచే నోడింపబడి చెఱగొనిపోఁబడుటయు ఆంధ్రవీరుల నేకులు యుద్ధమున వీరస్వర్గముచూరగొనఁ బోవుటయుఁ గాకతీయసామ్రాజ్య లక్ష్మి ఢిల్లీ తురుష్కవీరుల క్రౌర్యమునకుఁ దాళజాలక, పరాభూతయై, ఆంధ్రనగరంబున నొకక్షణమైన నిలువ నోల్లక, ప్రతాపరుద్ర ధనాగార రక్షకులగు హరిహర బుక్కరాయల తోడి చెలిమిఁ జేసి, దగువకర్ణాటక భూములకు పాఱివచ్చి, భయార్తయగుచు, నూత్న వరాన్వేషణ చిత్తయై త్రిలింగ కర్ణాటకభూములలో నటు నిటు బరువిడుచు చిందులు త్రొక్కనారంభించెను. కర్ణాటాంధ్రభూములలో విగ్రహారాధన ద్వేషమతాభినిరతులైన నూత్నజాతి ముసల్మాను వీరులు ప్రవేశించి నపుడు త్రిలింగ కర్ణాటక వీరప్రపంచంబు కలంగి, సంక్షుభితమయ్యెను. బలాఢ్యులయిన శాత్రవులు దండెత్తి వచ్చి తమదుర్గములాక్రమించుకొని ప్రతాపాగ్ని ప్రజ్వలింపఁ జేయుచుండ, రాచవారు కమ్మవారు రెడ్డినాయకులు బలిజనాయకులు పద్మనాయకులు నేకమై, వైరివీరులను తరిమి



ప్రతాపరుద్రునికిఁ బట్టముగట్టి యాంధ్ర సామ్రాజ్యము నుద్ధరించుటకు బదులు, స్వార్థపరులై, ఒక దేశీయుల మను మాట మఱచి, యదువృష్ణి భోజాంధకులవలెనె యొండొరుల గొంతుకలు కోసికొనుచు, నాంధ్రభూతలమును రక్తపూరితముఁ గావించుచుండిరి". ఆంధ్రుల చరిత్ర.

ఆంధ్రనగరమును దత్ప్రాంతములును మహమ్మదీయుల వశమయ్యెను. ఢిల్లీచక్రవర్తి తన పెద్దకొమరుడగు నలూపుఖానుని దక్షిణదేశమునకుఁ బాలకునిగ నియమించెను. ప్రాగాంధ్ర కళింగములపైనగూడ దాడివెడలిరి. రాజమహేంద్రవరముకూడ తురుష్కుల వశమయ్యెను. అలూపుఖాను సింహాసనమెక్కెను. ఇతఁడే మహమ్మదు బిన్ తోగ్లకు. ఇతని పిచ్చి ప్రభుత్వమున దక్షిణముననున్న మహమ్మదీయుల ప్రభుత్వము నాశమయ్యెను. తెలుగునాయకులు చిన్నరాజ్యములను వదలించుకొనిరి. మహమ్మదీయపాలకులె చక్రవర్తిని లక్ష్యపెట్టక స్వతంత్రరాజ్యములను స్థాపించిరి. వారిలోనొకఁడు 1347 నాటికి బహమనీ సామ్రాజ్యమును స్థాపించెను. ఇది 1518 వరకును దక్షిణమున నుచ్ఛస్థితిలోనుండెను. ఇందు పదునాలుగు సుల్తానులు పారిపాలించిరి. వీరిలో నలువురు బలవన్మరణములనొందిరి. ఇరువురు పదభ్రష్టులై కన్నులఁ గోల్పోయిరి. ఈసుల్తానులలో నైదవవాఁడుతప్ప తక్కిన

వారెల్లరు క్రూరులు సుఖలోలురు తమతోడి హిందూరాజులతో నెల్లప్పుడును పోరాడుచుండిరి. వీరెన్నో ఘోరకృత్యములు చేసిరి. అయినను వీరు ఇస్లాముమతమును విద్యలను ప్రోత్సహించిరి. వీరియొక్క గుణములను పరిపాలనాక్రమమును 1470 మొదలు 1474 వఱకును బీదరులో వసించి సంగతులనెల్ల బాగుగ గమనించిన రష్యాదేశపు వర్తకుఁడగు అతనేసియస్ నికెటినను వాఁడు బాగుగ వర్ణించినాఁడు. వీరెల్లప్పుడును విజయనగర రాజులతోను, తెలుగు నాయకులతోను, పోరుచుండిరట. వీరిరాజ్యమున జనసంఖ్య మెండుగనుండెనట. గొప్పవారు సమస్త సౌఖ్యములు ననుభవించుచుండినను, సామాన్యజనులు చాల దురదృష్టవంతులుగనుండిరట. వారిసైన్యములు జనసమూహములుగనుండి స్త్రీలతో పరివారజనముతో వర్తకులతోనుండెనట. యుద్ధములన దొమ్మియు దోపిడిలునట! ఓరుగల్లు మఱల వృద్ధిలోనికి వచ్చెనుగాని మహమ్మదీయులు దానిని పూర్తిగ నాశనముచేసిరి.

## ఆంధ్రదేశ రాజకీయస్థితి.

ఈకాలమున నాంధ్రదేశమును తెలుగునాయకులు పాలించుచుండిరి. ఓరుగల్లునకును శ్రీశైలమునకును మధ్యదేశమున నీకాలమున పాలించినవారు రేచర్లవంశజులు. అందు సింగమనాయఁడు ననపోతనాయఁడును మాధవభూపాలుఁడును



ఘనులు. వీరు, ఒకవంక బహమనీసుల్తానులతో నొకవంక రాచకూరితో నింకొకవంక రెడ్లతోడను పోరాడుచుండిరి. వీరు రాచకొండదుర్గముననుండిరి. భైరవప్రతిష్ఠల నెన్నో చేసిరి. వీరితరువాత రెండవ సింగమనాయఁడు రాజ్యముచేసెను. ఇతఁడును, బహమనీసుల్తానగు మహమ్మదుషాహాయు కర్ణాటాంధ్రభూపతియగు రెండవ హరిహరరాయలును సమకాలికులు. సుల్తాను సాత్త్వికుఁడగుటవలన నతనితో కలహము లేకున్నను రెండవహరిహరరాయలొకమాఱు దాడివెడలివచ్చుట నాతని నెదిరించెను. ఈసింగనవిద్వాంసుఁడైయైనను, రసార్ణవసుధాకరాది సంస్కృత గ్రంథములను రచించి సర్వజ్ఞుఁడని పేరుపొందినదితఁడు కాఁడని నిర్ణయింపఁబడినది. ఇతనితరువాత నితర పద్మనాయక వీరులు 1400 మొదలు 1450 వఱకును రాజ్యముచేసిరి. సింగమనాయని కుమారుఁడు కుమారాన్నపోతనాయఁడు ఇతనికి ముగ్గురు పుత్రులు ఇందు రెండవయాతఁడే పేరుపొందిన సింగన. పోతనకృతమనుకొనఁబడు భోగినీదండకమితనికే కృతియీయఁబడినది. "కుమారాన్నపోతావనీనాథసూనుర్ పోతమాంబాల సద్గర్భముక్తామణిః" అని దానియందు కలదు. మనుజేశ్వరాధములకిచ్చుట కంగీకరింపని పోతన, ఒక కృతి నితని నానిపైఁ జెప్పియిచ్చుట విశ్వాసపాత్రముగ లేదు. వెలుగోటివారి వంశచరిత్రయు రావువంశీయుల చారిత్రము నితని పాండిత్యమును గవిజనాద

రణమును గీర్తించుచున్నవి. వీరికి సర్వజ్ఞనామధేయము పౌరుషనామమని బొబ్బిలిసంస్థానాధిపతుల చరిత్రయందు లిఖియింపఁబడియున్నది. ఇతఁడు రాజమహేంద్రవరమును బాలించెనని ప్రతీతికాని, ఇది చరిత్రవిరుద్ధము. ఈకాలమున మహమ్మదీయులును గజపతులును రాజమహేంద్రవరము కొఱకు తగవులాడుచుండిరి. ఈసింగన యోరుగంటిరాజ్యమును పాలించెను. ఇతనిని పోతనగూర్చిన కొన్నిగాథలు ప్రచారమునన్నవి ఇతనిని శ్రీనాథకవి పొగడినాఁడు. సింగమనీనిఁగూర్చిన గాథలెన్నో కలవు. సింగమనాయఁడను పేరు కలవారెందరో కలరు. ఏయేగాథ లెవరివో చెప్పుటకష్టము భాగవత మీకాలముననె రచియింపఁబడియుండెనని కొందఱి యభిప్రాయము. రేచర్లప్రభువులకు సమకాలికులగు రెడ్లచరిత్రయు సుప్రసిద్ధమయినట్టిదె. 1325 నుండి 1380 వఱకును రాజమహేంద్రవరప్రాంతములను గోరుకొండరెడ్లు పాలించిరి. వీరు మొదట శైవులయ్యు తరువాత వైష్ణవమతావలంబులైరి. ఇందుఘనుఁడు వేమారెడ్డి. ఇతఁడు కవులను పండితులను పోషించెను. నాచన సోముఁడు తిప్పన మున్నగువారితని సమకాలికులు. అనపోత భూపాలునికాలమున సముద్రవ్యాపారముపిస్తరిల్లెను. ఇతనితరువాతఅనవేముఁడును, కుమారగిరి. భూపాలుఁడును, పెదకోమటి వేమభూపాలుఁడును పరిపాలించిరి మామిడి సింగనామాత్యవరుఁడీకాలమున చాల యశము



గడించెను. ఇతనికాలముననె శ్రీనాథుఁడు విద్యాధికారియు నభినవభట్టబాణబిరుదాంకితుఁడగు వామనభట్టు ఆస్థానకవిగనుండిరి. ఈపెదకోమటి వేమభూపాలుని సమకాలికుఁడును శ్రీనాథునిచే పొగడఁబడినవాఁడును, సర్వజ్ఞబిరుదాంకితుఁడు నగు రావు సింగమహీపాలుఁడెవఁడో తెలియలేదు. అటు తరువాత 1424 వఱకును రాచ వేమారెడ్డియు నతనితరువాత మల్లారెడ్డియు నతనివంశజులును రాజ్యమునేలిరి.

కొండవీటిసీమను పాలించినదేసటి అనపోతభూపాలుని మేనల్లుఁడగు కాటయవేమునిచరిత్ర చాలప్రఖ్యాతిఁజెందినది. ఇతఁడు 1386 మొదలు 1400 వరకును పరిపాలించెను. రెండవ హరిహరరాయలు తన కొమారితని తనికొమరునకిచ్చి పెండ్లి చేసెను ఇతని విద్యాపరిశ్రమయును, దానధర్మములును, శాసనములు చాటుచున్నవి. ఇతని తరువాత అల్లాడభూపతి రాజ్యమేలెను. ఇతఁడు పెదకోమటి వేమభూపాలు నెదిర్చి రాజమహేంద్రవరమును గాపాడుకొనెను. కర్ణాటక రాజులతోడను గజపతులతోడను సఖ్యము చేసికొనెను. ఇతఁడు వీరభద్రారెడ్డికి పట్టముగట్టి పోయెను. వేమభూపతులు శైవులు. చాల ధర్మములను చేసిరి. వీరభద్రుని విభవమును శ్రీనాథుడు బాగుగ ననుభవించినాఁడు. మనవేమన యీ కాలపువాఁడే కాఁబోలు.

అట కర్ణాటాంధ్రదేశమున నూతన సామ్రాజ్యము దిన దిన ప్రవర్ధమానమగు చుండెను. 1336 మొదలు 1355 వఱకును ప్రథమ హరిహరరాయలు పరిపాలించెను. తరువాత నితని తమ్ముఁడు వీరబుక్క భూపతి రాజ్యమేలెను. నాచన సోమన, ఇతనివలన, కడపమండలమున నున్న బుక్కపట్టనమును దానముగ గొనినట్లు తెలియుచున్నది. ఇతని కొమరుఁడు రెండవ హరిహరరాయలు. ఇతఁడు 1377 మొదలు 1404 వఱకును పరిపాలించెను. ఈ కాలములోనె మన బమ్మెర పోతరాజు పుట్టెనని కొందఱి యభిప్రాయము. తరువాత రాజ్యమునకువచ్చినవాఁడు ప్రథమ దేవరాయలు. ఇతఁడు 1422 వఱకు పాలించెను. విక్రమార్క చారిత్రము రచించిన జక్కన యిక్కాలపువాఁడె. తరువాత 1423 మొదలు 1447 వఱకును ప్రౌఢదేవరాయలు రాజ్యము నేలెను. ఈతని కాలమందె పోతన తనభాగవతము నొంటిమెట్టలో రచించెననియు పైకక్షివారి యభిప్రాయము. ఈరాజులెల్లరును ప్రసిద్ధులు. ధర్మానురక్తులు పండితులను పోషించిరి. దేశమును సుభిక్షముగ పరిపాలించిరి. పగతుర నెదిర్చిరి. రాజ్యమునువృద్ధిచేసిరి. అందువలననె తక్కిన చోటులనుండి పలువురిచ్చటికి వచ్చి నెలకొనిరి.

## సాంఘికస్థితి.

ఈకాలపుప్రభువులుపూర్వాచారములనుపాటించుచుండిరి. వీరికాలమున నియోగులు రాజోద్యోగము లందుండిరి. వీరే



మంత్రులుగానుండిరి. సింగనామాత్యుఁడు సుప్రసిద్ధుఁడు. దేవటివేముని మంత్రి రామాప్రెగ్గడ. అల్లాడభూపతి మంత్రి లింగన. వీరెల్లరు చాల తెలివికలవారు. ధర్మైకరతులు. వేమభూపాలుఁడు చాల పరాక్రమవంతుఁడు. ఈరాజులెల్లరు వైదికమతమును వర్ణాశ్రమ ధర్మములనుద్ధరించి పౌరాణిక విగ్రహారాధనము, శాస్త్రవిద్యలు ప్రోత్సహించి వివిధ ప్రతిష్ఠాపనములు కావించి దానధర్మములుచేసిరి. వీరి పాలనాక్రమమును బాగుగవర్ణించినవాఁడు శంభుదాసుఁడు. వేమభూపాలుండితనివలన కృతులందినాఁడు. కృష్ణాతీరమున వేమవరము నితఁడు బ్రాహ్మణుల కగ్రహారముగనిచ్చెను, చెఱువులు భావులు త్రవ్వించి జనులకుపకారముచేసెను. ఈకాలమున నగ్రహార బ్రాహ్మణులు దర్భలుంచెడువ్రేళ్లను రవ్వలయుంగరములను, గంధాక్షతలుంచుచోట కస్తూరి తిలకములను, జన్నిదముల దగ్గర ముత్యాల సరులును ధరించి సౌఖ్యములందనేర్చిరని శ్రీనాథుఁడు చెప్పుచున్నాఁడు.

మహమ్మదీయులతోడి పోరులవలన దోపిడులు సంక్షోభమును కలుగుచున్నను మొత్తము మీఁద ఆంధ్రనాయకుల పరిపాలనమున జనులెల్లరు సుఖముగనె యుండెను. వాణిజ్య వ్యవసాయములను బాగుగ నారసి కొనుచుండిరి. అవచి దేవయసెట్టి యనుకోమటి, వేమభూపాలునకు ప్రాణ

నుండెను. ఇతనికాలమున వర్తక వ్యాపారములకు మార్గము లేర్పడెను. ఇతఁడు పూర్వపద్ధతుల ననుసరించియె సుంకములను రాఁబట్టుకొనుచుండెను. రైతుల యుపయోగార్థము ధననిధుల నేర్పరచెను. అనపోత భూపాలుని కాలమున నొక గొప్ప సంగతి జరిగెను. పూర్వము కాకతీయుల కాలమునఁ జాలప్రాముఖ్యము నొంది వర్తకస్థానమై నౌకావ్యాపారమునకు ముఖ్యపట్టణమైయుండి తరువాత క్షీణించి నశించిన మోటుపల్లినితఁడు మఱల నుద్ధరించెను. అనేకములగు సదుపాయములను కల్పించి, మఱల వర్తకులను ప్రోత్సహించెను, అచ్చట నెలకొనువారికి నివేశనములిచ్చెను. కొన్నివస్తువులపైన సుంకములను తీసివేసెను. ద్వీపాంతర వ్యాపారమును ప్రోత్సహించుటె యాతని అభిప్రాయమని శాసనము నుడువుచున్నది.

వేమభూపాలునికి ప్రాపుగనుండిన యవచి దేవయసెట్టికుటుంబమువారు సముద్రయానముసేయుటయందును, విదేశవ్యాపారములు చేయుటయందును ప్రఖ్యాతిఁగాంచిరి. తిప్పయసెట్టి తమ్ముఁడైన చామియసెట్టి సముద్రయానముచేసి, నానాద్వీపాంతరములుపోయి, కర్పూరపాదపములు, బంగరుమొలకలు, సంకుమద్రవములు, ఆణిముత్యములు, చీనిచీనాంబరములు, గంధసింధురములు, తేజీహరులు మున్నగు



వాని నాంధ్రదేశమునకుఁ దెచ్చినటుల శ్రీనాథుని హరవిలాసము నుడువుచున్నది.

అట, విజయనగర సామ్రాజ్యమునకూడ వాణిజ్య వ్యవసాయములు బాగుగ సాగుచుండెను. ఆనగర విభవమును గూర్చి సౌధములను, బాజారులను, వ్యాపారములను, రాజుల వైభవమును, ప్రజల అభివృద్ధినిగూర్చియు, 1420 లో "నికోలోకోంటి"యను నిటలీదేశపువాఁడును, 1443లో హీరతుదేశపు అబ్దుల్ రజాకును. బాగుగవర్ణించిరి. నగరమునకేడు ప్రాకారములుండెనట. విశాలములగు బాజారులుండెనట. జనులు చాల సుగుణులుగనుండిరట, దేశమునందు నగలు ధరింపని స్త్రీపురుషులు లేరట.

మతములు వానిస్థితి.

ఈకాలమున వీరశైవమొకవంకను, వైష్ణవ మతమింకొక వంకనుండెను. శంకరు వారి యద్వైతము దేశమందు వ్యాపించెను. మనదేశమందు, అందుముఖ్యముగ నాంధ్రదేశమున వైష్ణవమునకును వీరశైవమునకును, ఘోరమగు కలహము జరుగుచుండెను, ఒకప్పుడొక మతము నింకొకప్పుడింకొక మతమును విజయమునొంది రాజసన్మానము నొందుచుండెను. హొయిసలలను రామానుజులవారు వైష్ణవులుగ

చేసిరి. చోళులెల్లరు వీరశైవులైరి. వీరు హొయిసలలను జయించినప్పుడు రామానుజులవారి మతము నూరుమూలలకు పారిపోవలసివచ్చెను. ఇట్లుకొన్ని వందలయేండ్లు పోరాటము జరిగెను. మహమ్మదీయులతోడి యుద్ధములందు, ఈయంతఃకలహము కొంతతగ్గెనుగాని అంతరింపలేదు. సంఘసంస్కర్తలు మతాచార్యులు ననేకులు బయలుదేరి నూతన బోధనలను చేయుచుండిరి. వేదాంతము ప్రబలెను. మనదక్షిణదేశమునందుండిన నవీనమతబోధకుఁడొకఁడుత్తర హిందూస్థానమున నేకేశ్వరారాధనమును, వర్ణముల యభేదమును బోధించి యనేకులను శిష్యులుగ చేసికొనెను. మహాపురుషుఁడగు కబీరు గురుఁడగు రామానందుఁడితఁడె. ఇతఁడు పదునాల్గవ శతాబ్దమువాఁడు. ఇట్టిసంస్కర్తలును, వేదాంతులును జ్ఞానులు నీకాలమున బలుపు ఊరూరఁ దిరుగుచుండిరి. అట్టివారిలో మనవేమన యోగి యొకఁడు.

రేచెర్లవారి వంశజులెల్లరును వీరశైవులు. అనపోతనాయఁడనేక భైరవ ప్రతిష్ఠాపనములు చేసెను. నిరంతర శివదేవతాపరాయణుఁడగుట నితని కాలమున వైష్ణవమతమునకు రాజసన్మానములేకుండెను. ఇతని తమ్ముఁడగు మాధవనాయుఁడును శైవుఁడె. ఇతఁడు శ్రీశైలమునకు మండప ప్రాకారాదులను గట్టించెను.



కోరుకొండ రెడ్లలో ముమ్మిడి నాయకుని పూర్వులు శైవులెయైనను, ఇతఁడు నితని తమ్ములును వైష్ణవులైరి. శ్రీరంగమునుండి యొక గురు వితనికడకువచ్చెను. ఇతఁడు వైష్ణవమతమును గోదావరి మండలమున వ్యాపింపఁ జేసెను. ముమ్మిడినాయకుని యనంతరము మరికొన్ని ప్రతిష్ఠాపనములు జరిగెను. కైంకర్యాదులకొఱకు భూదానము లీయఁబడెను. వీరికి కులగౌరవము మెండుగనుండెను. వైదిక మతాభిమానము చాలగనుండెను. దేసటి వంశపు రెడ్లకు శ్రౌత స్మార్త విద్యలయందలి యభిమానము మెండు. వీరు పౌరాణిక రాజులనాదర్శముగ కొనిరి. వేమూరెడ్డియునన వేమరెడ్డియు మాన్యములనేకములిచ్చినట్లు శాసనములు నుడువుచున్నవి. పెదకోమటి వేముఁడును సనాతన ధర్మములను ప్రోత్సహించెను. కాటయవేముని శాసనములనేక శివక్షేత్రములలో కనఁబడుచున్నవి. భీమేశ్వరుఁడును మార్కండేయేశ్వరుఁడును వీరికిఁ గులదైవతములుగ కనబడుచున్నారు. అల్లాడ భూపతి కుటుంబమునకుఁ గులగురువు ఘోడేరాయ భీమేశ్వరుఁడు. ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు. ఆరాధ్యుఁడు. వీరి కాలమున శివార్చనములు బాగుగ జరుగుచుండెను. నిర్మాల్యి ధోవతులకు విభూతిపండ్లకు రుద్రాక్షమాలలకు కొదువలేదు. శ్రీనాధుని భీమేశ్వరపురాణ మీకాలపు మతస్థితిని బాగుగ చెప్పుచున్నది.

బెండపూడి అన్నామాత్యుఁడు ననేక శివాలయ ప్రతిష్ఠాపనములు చేసెను.

ఇట్లు కర్ణాటాంధ్రమున, విజయనగర సామ్రాజ్యమున మతస్థితియు నించుమించుగ నిట్లేయుండెను. శైవమతమును వైష్ణవమతమును ప్రధానముగనుండెను. రాయలవారలెల్ల మతములయందును సమానాదరణమును చూపుచుండిరి. రెండవ హరిహరరాయలెల్ల మతములను బాగుగ నాదరించినను తాను మాత్రము శివవిరూపాక్షు నుపాసించుచుండెనట. విగ్రహారాధనములు నుత్సవములును విరివిగ జరుగుచుండెను. దేవరాయల కాలమున వర్ణములవారిలో వామదక్షిణ తెగలను కక్షలు బయలుదేరెను కాని అవి తీవ్రముగ లేవు. బ్రాహ్మణులును జైనులునుగూడ సుఖముగనుండిరి. ఇట్లు వివిధ మతములు విజృంభించినను మొత్తముమీఁద పండితులును కవులును సద్బ్రాహ్మణులును జాలవఱకు శంకరులవారి వేదాంతమును గ్రహించి యద్వైతసిద్ధాంతమును తమకు తోఁచినట్లు జనసామాన్యమునకు బోధించుచుండిరని ఆకాలపు వాఙ్మయమువలన తెలిసికొనఁగలము.

### వాఙ్మయము.

పదునాల్గు పదునైదవ శతాబ్దములు ప్రపంచచారిత్రమునఁ జాల ప్రసిద్ధిచెందిన శతాబ్దములు. మధ్యయుగాంతముగ, నూతనశక ప్రారంభయుగముగ నీ శతాబ్దములు పరిగణింపఁబడుచున్నవి. పాశ్చాత్య నాగరకతయందు పరివర్తనలు కలిగెను. క్రైస్తవ మత సంస్కరణ శాఖ ప్రబలెను. లోకమున జాతీయతాభిమానము ప్రజ్వరిల్లెను. నూతన అభిప్రాయములు ఉద్భవించెను. పాశ్చాత్య విశ్వవిద్యాలయములు, ఇటలీ, జర్మనీ, ప్రాన్సు, ఇంగ్లాండులలో మతాచారుల ప్రోత్సాహమునఁ వర్ధిల్లెను. మెల్లమెల్లన నావికులు క్రొత్తదేశములను కనుగొనుచుండిరి. గ్రీసుదేశపు వాఙ్మయమును నూతనదృష్టితో ప్రజలభ్యసింపసాగిరి. ఇటలీలో ఈనూతనోద్యమము ప్రారంభమయ్యెను. దీనినిబట్టియే కళలపై నభిమానము అందుముఖ్యముగ శిల్పముపైన, చిత్రలేఖనముపై నభిరుచి మెండయ్యెను. పాశ్చాత్య నాగరికమున రాజకీయరంగమున నిరంకుశ పాలనమును బోధించు ఘనులు, నిరంకుశముగ పాలించుఘనులు బయలుదేరిరి. పదునైదవ శతాబ్దము తుదిని అమెరికా కనుగొనబడుటయు హిందూదేశమునకు దారి కనుగొనబడుటయు జరిగెను. దీనివలన నూతన నాగరికతలు తారసిల్లెను. నూతనాభిప్రాయములు ప్రజలయందు కలిగెను. ఈ నవయుగమునుగూర్చి ఘనులగు హాలము, లాడ్జి బర్కార్టు గొప్పగా వర్ణించి వ్రాసియున్నారు.

ఇది ఆంధ్రవాఙ్మయ చరిత్రమునఁ బురాణయుగమని చెప్పవచ్చును. కవి సార్వభౌముఁడు పురాణములనెన్నో తెనిఁగించి



నాను. పురాణకథలనె ప్రబంధములుగ వ్రాసినారు. అయిన కృతులవలననే ఈ కాలమునాటి ఆంధ్రదేశచారిత్రము మనకు లభించుచున్నది. పోతనామాత్యుని ఆంధ్రభాగవతము తప్ప తక్కినకృతులెల్ల ఆకాలపురాజులకు, మంత్రులకు, అంకితము లీయఁబడినవి. అందువలననే ఆకాలపు ఆంధ్రదేశపు రాజకీయస్థితి చక్కఁగ మనకు తెలియుచున్నది. అయినను తమ్మాదరించిన ప్రభువులనుగూర్చి ఆస్థానకవులు కఠినముగ వ్రాయరుకదా? శ్రీనాథుఁడు వైరివీరులను గురించి వ్రాసినపట్లను పోతన్నగారు రాక్షస నాయకులను వర్ణించి చెప్పినపట్లను, వేమన్నగారి పద్యములందును, ఆకాలపు రాజుల స్వభావము, గుణములు, యుద్ధములు, పరిపాలనము, తెలిసికొనఁగలుగుచున్నాము. శ్రీనాథుని రాజమహేంద్రపుర వర్ణనము, ఆంధ్రదేశమును గూర్చిన ప్రశంస, పలనాటిని గూర్చిన వర్ణనము, కొండవీటిపుర వర్ణనము, అగ్రహార బ్రాహ్మణుల వర్ణనమును మనకు మనదేశ చారిత్రమును కన్నులకుఁ గట్టినటుల చూపుచున్నవి. ఫిరోజిషానుగూర్చి మనము చదువు చాటు పద్యములు, మల్కిభరామునిగూర్చిన చాటువులు ఇతర కవులు వ్రాసిన చాటువులును సాంఘికమత స్థితులనుగూర్చి యెంతో బాగుగ తెల్పుచున్నవి. ఆంధ్రదేశమున సర్కారులనుకొనబడు కృష్ణా, గోదావరి ప్రాంతములు పశ్చిమాంధ్ర మనబడు నూత్న కర్ణాటాంధ్రదేశమునను, స్థితిగతులెట్లుండెనో తెలిసి



కొనుట శ్రీనాథుఁడు, వేమన, పోతన, ఎఱ్ఱా ప్రగ్గడ నాచన సోముఁడును మనవాఙ్మయమునందు ప్రకాశించునంతకాలము కష్టములేదు. ఇప్పుడిప్పుడు కనుగొనఁబడుచున్న శాసనములెల్ల మనకవుల చరిత్రరచనలు నిజములనియని తెలుపుచున్నవి. ఇంచుక అతిశయోక్తి తీసివైచినచో శేషము చరిత్రముగ నిర్ధారణము కావించుకొని, పైకృతులను బరిశీలించుట ముఖ్యము. వాఙ్మయనిర్మాతలనుబట్టి దేశముయొక్క నాగరికతను నిర్ణయింపవచ్చును. శ్రీనాథునిగన్న ఆంధ్రదేశము, శ్రీనాథుని రచనలఁ జవిగొన్న ఆంధ్రలోకము—శ్రీనాథుని గౌరవించిన రాజులు, పోతరాజునిగన్న ఆంధ్రభూమి, పోతరాజు రచనల నలరిన ఆంధ్రులు, వేమనవంటి సంస్కర్త పుట్టినదేశము, ఇట్టి ఔన్నత్యము పొందిన ఆంధ్ర నాగరికత యెంతటి వైభవముగనుండెనో గ్రహింపలేమా? అనంతామాత్యుఁడు, జక్కన, నందిమల్లన, ఘంటసింగయ, కర్ణాటాంధ్ర సామ్రాజ్య వైభవమును వర్ణించిన కవులు. కృష్ణదేవరాయని అష్టదిగ్గజముల యుగమునకు ముందుండినవారు.

ఆంధ్రదేశపు నాగరికత యీకాలమున కృష్ణా, గోదావరుల నంటియుండెను. పదునైదవ శతాబ్దము గడచినకొలదిని శ్రీనాథుని విభవమువలెనే అదియు నశించెను. పోతరాజుగారి మాట నిజములయ్యెను. వేమన్నగారి నీతులును నిజముల

య్యెను రాజులు ధనమదాంధులైరి. ప్రజలు సుఖాసక్తులైరి సంసారసాగరమున మునిగిరి. కస్తూరి హేమపాత్రాన్నము. పోయినవి. దినవెచ్చమై దొరకుట దుర్లభమయ్యెను. దురదృష్టము శ్రీనాథునకే కాదు—ఆంధ్రదేశమునకే వచ్చినది! దారిద్ర్యము వచ్చినది. రాజమహేంద్రవరపు రెడ్డిరాజ్యమునకు గజపతులు విరోధులు. వీరికి కర్ణాటకులును శత్రువులు. పశ్చిమమున బహమనీరాజ్యము విజృంభించుచుండెను. వీరికిని కర్ణాట చక్రవర్తులకును యుద్ధములు గలిగెను. యవన కర్ణాట కటక భూధవులు సమానబలులు. అందువలన సమరములు భయంకరములయ్యెను. ఇట్టిస్థితిలో రెడ్డిరాజ్యము నిలువ లేకపోయెను. ఇట్లుండగ గజపతుల రాజధాని యగు కటకమున 1434 లో విప్లవము కూడ కలిగెను. కపిలేంద్ర గజపతి రాజమహేంద్ర నాశనమును గోరి దానిపై దండెత్తెను. ఈకల్లోలములలో—దురదృష్టములో—నాంధ్రసామ్రాజ్యలక్ష్మి నిలువలేక మెల్లమెల్లన గౌతమీకృష్ణవేణులపైఁ కెగఁబ్రాకి, స్వాత్మ కర్ణాటాంధ్ర సామ్రాజ్యమున దలదాచుకొని యా భూపతుల యాదరణమున, కవుల సాహాయ్యమున, ప్రజల గారామున నవశక్తితో ప్రపంచమునందలి నవయుగారంభపు మెఱుంగులనదగు కళకాంతులతో, మహమ్మదీయ పోర్చుగీసు నాగరికతల సమ్మేళనముతో పేయస్ మున్నగువారు వర్ణించిన విజయనగర వైభవమునఁ బొల్గొసనది. శ్రీకృష్ణ



దేవరాయని మహోన్నతి ననుభవింపఁ గలిగి, కీర్తిని దిగంతముల వ్యాపింపఁ జేయగలిగినది.

ఈ రాజకీయసాంఘికమత స్థితులకు, ఆకాలపు వాఙ్మయమున జాల నిదర్శనములు కలవు. పోతనామాత్యుని కృతియందును నిదర్శనములనేకములు కనబడుచున్నవి. మతమును గూర్చిన జిజ్ఞాస, ఆచారవ్యవహారములను గూర్చిన అభిప్రాయములు, రాజులను గూర్చిన విమర్శనమును, పోతన, అచ్చటచ్చట వెల్లడించినాఁడు. సమయోచితముగ నాయా తావుల యందు సూచించినాడు.

పోతన తన వంశావళి నొక పద్యమునఁ జెప్పికొనినాఁడు. అమాత్యుఁడనుట నియోగియని తేలుచున్నది. అయినను ద్యోగము నపేక్షింపక పొలముదున్నుకొనిన మహాత్యాగి యితఁడు. ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు. ఆపస్తంభసూత్రుఁడు. తండ్రి కేసన. తల్లి లక్కమాంబ. వీరిమతము శైవమని తెలియుచున్నది. అయినను వీరికద్వైతమునందభిమానము మెండు. పోతన భాగవతమునం దిట్లు పలుకుచున్నాడు.

"చేతులారంగ శివుని బూజింపఁడేని, నోరునొవ్వంగ హరికీర్తినుడువఁడేని
దయయు సత్యంబులోనుగా దలఁపఁడేని కలుగ నేటికి తల్లుల కడుపుచేటు"

పోతన భాగవతమును రచియించిన పరమభాగవతోత్తముఁడయ్యు శివుని దూషింపఁడు. ఇతనికి హరిహరులందు సమాన

మగు భక్తికలదు. ఇతఁడు తనకాలమునందుండిన మతవైషమ్యమును చూచినాఁడు. ఇది యితనికి సమంజసముగ తోఁచలేదు. అందువలన నభేదభావమును బోధించినాఁడు. భక్తిచేతనె భగవంతుని సాధింపుమన్నాఁడు సర్వాంతర్యామియు సర్వేశ్వరుఁడు నొక్కఁడేయని ఇతఁడు నమ్మినటుల "ఎవ్వనిచేఁ జనించుజగమెవ్వనిలోపలనుండు లీనమై" యని వ్రాసిన సుప్రసిద్ధపద్యమె తెలుపుచున్నది. ఇతఁడు బాలభక్తుఁడగు ప్రహ్లాదునిచే మనకు భక్తియోగమును బోధించినాఁడు. సర్వేశ్వరుఁడెందెందు వెదకిచూచిననందేకలఁడని యుచ్చరించినాఁడు. అందు శైవ వైష్ణవమతములకు కలిగినవిరోధమును బాగుగ ప్రదర్శించినాడు. అయినను శంకరమతమె లెస్స యనుటకోయన "మోహనిర్మూలముచేసి యెవ్వనియందు తత్పరులయినయోఋకగల పురుషులకుం బరులుతామనియెడు మాయాకృతంబయిన యసద్గ్రాహ్యంబగు భేదంబుగానంబడదట్టి పరమేశ్వరునకు నమస్కరించెదనని ప్రహ్లాదునిచేత పలికించినాడు.

దుఃఖమునందు మునిగినఆర్తులకు, ఒక్కొకప్పుడు "కలఁడు కలండనెడువాఁడుకలఁడో లేఁడో!"యను అనుమానమునుగలుగుచుండును. నిర్హేతుకజాయమాన కరుణగల ప్రేమమయుఁడు తనభక్తులను బ్రోచునని, గజేంద్రమోక్షమున చెప్పినాడు.



పోతన, తనకాలమునాటి సంఘదురాచారములను చూచినాఁడు. ఐహికసుఖములందు నిమగ్నులై సంసారసాగరమున మునుగుచు తేలుచున్నవారిగతి యెట్టులాయని వితర్కించినాడు. భగవన్నామామృతమె దీనికిమందని గ్రహించెను. "తాపత్రయాభీల దావాగ్ని" ఇదిలేనిచో నారదు. దుఃఖములునశింపవు. మోక్షముచేకూరదు. దారిద్ర్యముపోదు. పోతనతనచుట్టునున్న దారిద్ర్యదుఃఖములను, అన్యాయములను, అసత్యములను చూచినాఁడు, కుచేలునికన్న దుఃఖమనుభవించినవాఁడెవఁడు? ఈఘోర ప్రపంచమునుండి వెలువడుట కొకటే మార్గమని అదిభక్తియోగమని భాగవతమున బోధించినాడు. ఈఅభిప్రాయముల నాయాఘట్టములలో నొక్కిచెప్పినాడు. ఇతఁడుభగవంతుని గుణములను స్మరించుచు నొక్కొకయెడ భక్తిలోలీనమైపోయినాఁడు. ఇతనిభక్తినిగూర్చిన గాధలనేకములున్నవి. ఇతనికాచార వ్యవహారములందు గుఱియెక్కడని యితని పలుకులవలన తెలిసికొనఁగలము.

పోతనకు దగ్గరచుట్టములు. స్నేహితులు, సమకాలికులననేకులు ప్రభుత్వోద్యోగములందు సుఖముగనుండిరి. కవులు ప్రభువులకుఁ గృతులిచ్చి ధనముఁగడించిరి. పండితులు రాజులనాశ్రయించిరి. పోతనయిదిచూచినాఁడు కాని యైహికసుఖేచ్ఛయితనికిలేదు. స్వతంత్రజీవనమే యితనికిష్టము. హాలికుఁ

డుఁగ నేయుండుట దీనికన్న గౌరవమని తలచెను. ఇవియునుగాక ఇతని కాలపు రాజులు, నాయకులును, ధనవంతులును, మదాంధులై తమ యిచ్చవచ్చినట్లు చరించుచుండిరి. ఒండొరులతో పోరాడుచుండిరి. ప్రజలను పోషించి సుఖపెట్టుటకు బదులు దోచి శ్రమపెట్టుచుండిరి. ఒండొరుల గొంతుకలఁ గోసికొనుచు భగవంతుని శాంతికి భంగము కలిగించుచుండిరి. వీరు దుర్యోధనాదులను పోలినట్లు లీతనికిఁ గనపడిరి. అందువలన నిట్టి "మనుజేశ్వరాధములకు" కృతినిచ్చుటయు వారివలన కొన్ని సొమ్ములు పుచ్చుకొనుటయు నరకమున బడుటకై కారణమగునని యితడూహించెను. వీరికి కావ్య కన్యక నిచ్చి ధనముఁ గొంట పడుపుకూడు భుజింపుట. వీరి నాశ్రయించి కవిత చెప్పుట భారతిని కర్ణాట కిరాట కీచకులకమ్ముట. పోతన యభిప్రాయములు సూచించుటకొరకు కొన్ని పద్యము లుదాహరణలుగ చూడ వచ్చును.

సీ॥ "కమనీయ భూమిభాగంబులు లేకున్నె
పడియుండుటకు దూదిపఱుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నె
భోజనభాజన పుంజమేల?
వల్కలాజినావళులు లేకున్నె
కట్టదుకూల సంఘంబులేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నె
ప్రాసాద సౌధాది పటలమేల?



ఫలరసాదులు గురియవే పాదపములు
స్వాదుజలముల నుండవే సకల నదులు
పొసఁగ భిక్షము పెట్టరే పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల తాపసులకు" ॥

అని శుకుఁడు పలికినట్లు వ్రాసినాడు. మఱియు నింకననేకచోటుల రాజుల కొలువులనుంట నిరసించినాడు. అయినను మంచి భూపతుల పాలనమితడు నిరసింపఁడు. అరాజకముఁ గోరడు. అరాజకమువలన వచ్చు కీడుల నితఁ డెఱుగును. శమీకమహాముని పరీక్షిత్తును శపించిన కుమారుని జూచి యెట్లు పలుకుచున్నాడో చూడుడు.

సీ॥ "పాపంబు నీచేత ప్రాపించె మనకింక రాజు నశించిన రాజ్యమందు
బలవంతుడగువాడు బలహీను పశుదారహయనువర్ణాదుల నపహరించు
జారచోరాదులు సంచరింతురు ప్రజ కన్యోన్య కలహంబు లతిశయిల్లు
వైదికంబైయున్న వర్ణాశ్రమాచార ధర్మమించుక లేక తప్పిపోవు
వంతమీద లోకులర్థకామంబుల దగిలి సంచరింప ధరణియెల్ల
వర్ణసంకరములు వచ్చును మర్కటసారమేయ కులము మేర బుత్ర" ॥

అయిననేమి; పోతన కాలపు రాజులు ప్రజలను పోషించుచున్నారా? తామొండొరులతో సఖ్యముగ నున్నారా? వారు కంసరాజువలె

"తల్లిదండ్రులనైన దమ్ములనన్నల సఖులనైన బంధుజనులనైన
రాజ్యకాంక్ష జేసి రాజులు చంపుదు రవనిఁ దఱుచు జీవితార్థులగుచు"

దుష్టశిక్షణము శిష్టరక్షణమును మొదలె లేదు. వీరు ధనమదాంధులై క్రిందుమీఁదుఁ గానక మెలఁగుచుండిరి. వీరిని కొలుచుట గౌరవ హీనము.

క॥ "రక్షకులు లేనివారల రక్షించెదననుచుఁ జక్రి రాఁ డైయుండన్
రక్షింపుమనుచు నొకనరు నక్షముఁ బ్రార్థింపనేల నాత్మజ్ఞులకున్" ॥

వీరి వైశ్వర్యమును నాగరికము నితనికి రోఁతగనుండెను. ఈ రాజుల పరిపాలనాక్రమముగూర్చిన విమర్శనము, వీరి గుణవర్ణనమును, కంస, జరాసంధ, శిశుపాలురనుగూర్చి వర్ణించిన ఘట్టములందు సహజముగనుండునట్టులు చేసినాడు.

భాగవతకృతి విమర్శనము.

భాగవతము పదునెనిమిది పురాణములలో నొకటి. నీతిబోధకమై, భగవంతునిగూర్చిన కథలతో అనేకములగు నుపాఖ్యానములతో రసవంతముగ సంస్కృతమున రచియింపబడినది. దీనిని పోతన తెనుఁగుచేసినాఁడు దీని నాంధ్రీకరించుటకుఁగల కారణము పోతన తన భాగవతమందియిట్లు వ్రాసినాడు. "మదీయ పూర్వజన్మ సహస్రసంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణకథా ప్రపంచవిరచనా కుతూహలుండనై, యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకఁగనుంగొని, సజ్జనానుమతంబున సబ్రింకమళుభ్రమసముత్తుంగ భంగయగు గంగకుఁజని క్రుంకులిడి, వెడలి, మహనీయమంజుల



పులినప్రదేశంబున మహేశ్వరధ్యానంబు చేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై యున్న యెడ రామభద్రుండు తన నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబు తెనుంగు సేయ నానతిచ్చి తిరోహితుండయ్యె. మఱియు.

"మ॥ ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్
తెనుగుల్సేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁజేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్ ॥"

అని పలికినాఁడు. భాగవత పురాణమును పోతనయిట్లు ప్రశంసించుచున్నాఁడు,

"మ॥ లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై ॥"

ఈ గ్రంథము నితఁడు పండితులు మెచ్చుకొనునట్లు తెనిఁగించినాఁడు. సంస్కృతమును నీళ్లకు నీళ్లు ప్రసాదమునకు ప్రసాదముగనుగాక, రసవంతముగ ననువాదముచేసినాడు. అందలి విశేషములను విపులముగ విప్పి జెప్పినాడు. మఱియు విష్ణుపురాణ హరివంశములలోని కొన్ని కథాంశములనుకూడ చేర్చి కథా చమత్కృతికి వన్నెపెట్టినాడు. భక్తియు జ్ఞానమును

కష్టమగు విషయములుగాన పామరులకు బాగుగ తెలియునట్లు బోధించినాడు.

కథాచమత్కృతి

భాగవతమున కథాచమత్కృతి బాగుగనున్నది. ఇందు వక్త శుకయోగి. ఇతడు జీవన్ముక్తుడు. ఇందలి శ్రోత పరీక్షిన్నరేంద్రుడు. అతడు హరిభక్తుడు. ఇందలి విషయమన్ననో ఏడుదినములలో ముక్తినిచ్చు భక్తియోగమును బోధించు భాగవత కథ. శ్రీకృష్ణుడుత్తరా గర్భమునురక్షించుటయు పరీక్షిత్తు చరిత్రయు శమీకమునిపైన సర్పము వేయుటయు మునికుమారుని శాపమును, శుకయోగీంద్రునిరాకయు భాగవతపురాణము ప్రారంభమగును. నారాయణుని లీలావతారవర్ణనము మూలకథాభాగము. ఇందు వృత్రోపాఖ్యానము, అజామిళోపాఖ్యానము, గజేంద్రమోక్షము, ప్రహ్లాద చారిత్రము, మున్నగు నుపాఖ్యానములు రసవంతములుగనున్నవి. శ్రీరామ చరిత్రయు కృష్ణలీలలును వాని తత్వమును మనోహరముగ జెప్పబడినవి. రుక్మిణీకల్యాణమును మనయాంధ్రకన్యక లెల్లరు చదువుచున్నారు. శ్రీకృష్ణుని చరిత్రలో వీరరసమొలుకు జరాసంధవధయు, నరకాసురవధయు నద్భుతముగవర్ణింపబడినవి. సుభద్రాపరిణయము చాలరమణీయము. శ్రీకృష్ణబలరాములు వైకుంఠమునకరుగుటయు, మార్కండేయోపాఖ్యాన



ముతో సమాప్తమగును. ఇది మనమీకాలమున జదువుచున్న కథామంజరివలె, ఆఖ్యాయికాసమూహమువలె, రసవంతముగనున్నది.

పాత్రపోషణము: శ్రీకృష్ణుడు.

అధునిక వచన రచనలందును, పాశ్చాత్య వాఙ్మయములందునున్నట్లుండకపోయినను, మన యాధ్యాత్మికదృక్పథానుసారముగ మన పురాణములందు పాత్రపోషణముకలదు. పాత్రపోషణమనగా గుణప్రదర్శనమును, సత్యవిజయమును ప్రదర్శించుటయె మన యాదర్శములుగనున్నవి. భాగవతమందు శ్రీకృష్ణుడె ప్రధాన పాత్రము. అయినను శ్రీకృష్ణుడు మానవమాత్రుడు కాడు. ఇతడు శ్రీమన్నారాయణావతారము. భగవద్గీతలలో చెప్పబడిన సాధుపరిత్రాణముకొఱకు, దుష్కృతవినాశముకొఱకు, ధర్మసంస్థాపనార్థము లోకమునందవతరించిన శ్రీమహావిష్ణువితడు. ఈరెండుసంగతులును గుణములును భాగవతమున బాగుగప్రదర్శింపబడినవి. మానవగుణములు నవతారమహాత్మ్యమును బాగుగ పోషింపబడినవి.

కేవలము యోగసిద్ధులుకూడ చేయగలకార్యములను మాత్రమె శ్రీకృష్ణుడు చేసియూరకొనలేదు. ఇతడొక పూ

ర్ణావతారము. ఇతఁడు బాల్యమున నేచేసిన రాక్షసవధలిది స్థాపింపఁజాలవు. అనేకులిట్టిది చేసిరి. కృష్ణుఁడు కావించిన దావాగ్ని త్రాగుట, గోవర్ధనోద్ధరణము మృతులఁ బ్రదికించుటయు నితరులుచేసినట్లు పురాణములు నుడువుచున్నవి కాని, ఇతఁడు శంఖచక్రగదా హస్తుఁడై చతుర్భుజుఁడై జన్మించుట, యశోదకు గర్భంబున బ్రహ్మాండంబుఁజూపుట, నలకూబరమణిగ్రీవుల శాపముక్తులనుచేయుట, అక్రూరునకు నిజస్వరూపంబుచూపుట, పూతనా మోక్షము, శిశుపాలదంతవక్త్రవధ, దేవకీ వసుదేవుల వరప్రాప్తి, ముచుకుందవరదత్తము, బాణాసుర యుద్ధంబున శివపరాభూతి, విశ్వరూపసందర్శనములు నితని యమానుషకృత్యములుగ వర్ణింపఁబడినవి. శ్రీకృష్ణగుణవర్ణనము చాల మనోహరముగ చేయఁబడినది లీలామానుషవేషధారియగు విష్ణువు మనుష్యలోకమున నవతరించి, లోకసంగ్రహార్థముఁ మనుష్యచర్యల నత్యద్భుతముగ జరిపినాఁడు.

పుత్రధర్మము.

పాపము, దేవకీదేవియు వసుదేవుఁడును గృష్ణుని గాంచినారేకాని అతని ముద్దుముచ్చటలు చూడ నోచుకొనరైరి. ఆభాగ్యము యశోదానందులకుఁ గలిగెను. నిజముగ యశోదకు తన్నువిడిచి యొకక్షణమైనను పనిచేసికొనుటకు కృష్ణుఁ



డవకాశ మీయలేదు. ఏదో పిల్లచేష్టచేసి యామెనాకర్షించును. కృష్ణాయని యొకత్రుటికాలమయినఁ బిలువకుండగ నుండలేదు. కృష్ణుని గట్టనుఁదిట్టను కృష్ణుని నేరములు విచారింపను యశోదకు కాలముసరిపోవుచుండెను. పండువంటి బిడ్డఁడు తల్లిదండ్రుల కెంతసంతోషము కలిగింప సాధ్యమో అంత సంతోషమును బాలకృష్ణుఁడు యశోదానందులకు కలిగించినాఁడు. తరువాత దేవకీవసుదేవులను సంతోషపెట్టినాఁడు. పోతన, ఈపుత్రధర్మమును ముద్దులొలుకు మాటలతో మనోహరముగ వర్ణించినాఁడు.

శిష్యధర్మము.

బ్రహ్మచర్యాశ్రమము స్వీకరించినవేళ కష్ణుఁడు గురుపులయొద్ద యెంతభయభక్తులతో నటించెనో ఎట్లు తనగొప్పదనము దాఁచి వినయవిధేయతలతో గురువునకు గురుభార్యకును శుశ్రూష చేసెనో, తుదకుఁ కౌపీనమాత్రధారియై యడవికిఁబోయి, కట్టెలుకొట్టి మోపుకట్టి, నెత్తిపైన బెట్టుకొని గాలి వానలో తడియుచు, శ్రమించియు నించుకంతయైన మనసున నొచ్చుకొనక విద్యలునేర్చి, తుదకు వారుకోరిన గురుదక్షిణలిచ్చి స్నాతకుఁడై వచ్చెనో, కుచేలోపాఖ్యానము వలనఁ దెలియుచున్నది.

మిత్రధర్మము.

శ్రీకృష్ణుఁడును కుచేలుఁడును సహాధ్యాయులు. కృష్ణుఁడు సమస్త భోగములందు నున్నప్పుడు గర్భదారిద్ర్యమునం దున్న కుచేలుఁడు పోవఁగ దూదివలె మృదుతల్పముననె యతనిఁ గూర్చుండ బెట్టి, అసురసంహారుఁడు కుచేలుని కరముఁ గరంబున దెమల్చి కడక న్మనము గురుగృహంబున వరించిన చరితములని కొన్ని నుడివి," చిన్ననాటి యాటపాటలను గూర్చి ముచ్చటించి, అతఁడు తెచ్చిన యటుకులను ప్రేమతోఁ దిని అతనిని సత్కరించి పంపెను.

శ్రీకృష్ణుఁడు పాండవులకు నెయ్యము. బంధువుఁడు. అన్నిటికిని దాసనై వారి నారసి కొనుచుండెను. వారికి సచివుఁడుగ ప్రాణముగ నుండెను. వారిని గట్టెక్కించినాఁడు. ఇఁక అర్జునునకు నితనికిని దేహములు రెండుగాని ప్రాణ మొకటె. వీరి స్నేహతత్త్వమునుగూర్చి విమర్శగ్రంథములు వ్రాయవచ్చును. ధర్మరాజుతో అర్జునుఁడె పలికిన పలుకులివి.

సీ॥ "చెలికాఁడ నమ్మంచు చీరు నన్నొక వేళ మన్నించు నొకవేళ మఱది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ, దాతయై యొకవేళ ధనములిచ్చు
మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు బోధయై యొకవేళ బుద్ధిసెప్పు
సారథ్య మొనరించు జనువిచ్చి యొకవేళ గ్రీడించు నొకవేళ గేలిసేయు
నొక్కశయ్యాసనంబున నుండు గన్నతండ్రి కైవడిఁ జేసిన తప్పు గాచు
హస్తములు వట్టి పొత్తున నారగించు మనుజవల్లభ మాధవుఁ డనుఁగు రాఁడు."



క॥ "మనసారథి మనసచివుఁడు మనవియ్యము మనసఖుండు మనబాంధవుఁడున్
మనగురుఁడు మనకు దేవర మనలను దిగనాడి చనియె మనుజాధీశా!॥"

గార్హస్థ్యధర్మము సహితము శ్రీకృష్ణుఁడు బాగుగఁ జరిపినాఁడు, తనభార్యలవిషయమున, బంధుగులపట్ల, అతిథి యభ్యాగతులపట్ల నితఁడు బాగుగ ప్రవర్తించెను.

ఇతఁ డాత్మజనరక్షణార్థమును, ధర్మసంరక్షణార్థమును, పెక్కురవధించెను గాని కామక్రోధాదులు కారణములుగ నట్లు చేసినవాఁడు కాఁడు. ముందుగ విరోధికి హితబోధ చేసి లాభము లేక, అవశ్యకర్తవ్య మగుటనట్లు చేయుచువచ్చెను. ఆయన లీలల కెల్ల నంతరార్థము కలదు. అవి పైకి యెట్లు కనబడినను వాస్తవముగ నిష్కామకర్మయోగము ప్రదర్శించుచున్నవని పెద్దలందురు.

శ్రీకృష్ణుఁడు ప్రేమమయుఁడు. అతనిని చూచి కొందఱు, మాటలువిని కొందఱు, స్పర్శమువలన కొందఱును పరవశు లగుచుండిరి. అతనిమూర్తి మనోహరమైనది. ఆత్మదివ్యమయినది. ఆయనయందొక దివ్యతేజముండి యెల్లర నాకర్షించుచుండెను. అతనిని చూచి స్త్రీలోకము, నారదాదులును పరవశులైరి. అతఁడు బాల్యమునఁ జేసిన దుడుకుతనమున కెవ్వరు నతనిని గొట్టలేకపోయిరి. గోపికలకెల్లర కతనియందనురాగము కలిగెను. ఒకవాడవాడల మురళీగానము వారి నాకర్షిం

చెను. వారువచ్చిరి. అతఁడెన్నో బుద్ధులు చెప్పెనుగాని లాభము లేకపోయెను. వారు పరవశులైరి. అంతరాసక్రీడ జరిగినది. శ్రీకృష్ణుని క్రీడలను వర్ణించునప్పుడు వ్యాసులవారు వ్రాసిన భాగవతమున లేని కొన్ని శృంగారచేష్టలను పోతన వర్ణించినాఁడు. భక్తిపారవశ్యమున నేమరుచున్నాఁడో యెఱుఁగకయో, ఎఱిగియు భగవంతునిగూర్చి యేమిచెప్పినను దోషములేదని తలంచియో, ఈపరమ భాగవతోత్తముఁడు, కృష్ణుఁడు గోపికలను చౌశీతిబంధములందని పెనఁచెను. రాసక్రీడనాటికి శ్రీకృష్ణుఁడెనిమిది తొమ్మిదేడుల బాలుఁడు! ఇట్టితరి చౌశీతిబంధములు శృంగారచేష్టలు నేమి? ఇది కేవలము మాయాలీల. సమ్మోహనము. ఈలీలలెల్ల విచిత్రములు. తామరలోని నీటిబిందువు పగిది నిష్కామకర్మను పరిదర్శించుచున్నవి.

అట్లు శ్రీకృష్ణుని గుణపోషణము రసవంతముగ పోతన తెనుఁగుచేసినాఁడు. మానవచర్యలెంతో ప్రకృతి స్వభావోచితముగ తగినమాటలతో చెప్పుచు, నవతారమాహాత్మ్యమును విపులముగ వర్ణించి చెప్పినాఁడు. ఇఁక భాగవతమునఁగల తక్కిన పాత్రముల సంగతియేమి? ఇందు వేనవేలు పాత్రములున్నవి. ప్రధానములగునవియు వందలకొలదికలవు. వానిని గూర్చి తెలుపుటకొక గ్రంథము కావలెను. భాగవతమునే కరువుపెట్టుటయగును. ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు, మున్నగు బాల



భక్తుల గుణవర్ణనము, జీవితప్రదర్శనమునెంతో బాగుగ చేసినాఁడు. వారిమాటలు, చేష్టలు, చాల గంభీరముగనుండును. స్త్రీపాత్రములనుగూడ జాగ్రత్తగ తనసహజకవితాధోరణిని పోషించినాఁడు. బాలికయగు రుక్మిణిని మనభారతీయకన్యకలలో శిరోమణిగ, ఆదర్శముగ చేసినాఁడు. ఆబొమ్మపెండ్లిండ్లు, గుజ్జనగూళ్ళు, ముద్దుముచ్చటలును, గుణపోషణమున ప్రతిమానములు. చిన్నపాత్రములని పోతన నిరసించివదలఁడు. కాళీయుని భార్యలు, లీలావతి, గోపికలు నెంత బాగుగ చిత్రింపబడినారో చూడుడు. పోతనకృతియందు స్త్రీపాత్రములనుగూర్చిన విశేష మొకటికలదు. సత్యభామాయుద్ధాంకము భాగవతమూలగ్రంథమున లేదు. ఆఘట్టమును కన్నులకుఁ గట్టినటుల పోతన చిత్రించినాఁడు. సత్యభామచర్య యద్భుతము. ఈఘట్టమునే నాచన సోముఁడు తన యుత్తరహరివంశమున వర్ణించినాఁడు. గుణగ్రహణపారీణులగు పండితులు నీరెంట నేది బాగుగనున్నదని నిర్ణయించుటకింకను తగవులాడుచున్నారు. పాత్రపోషణమునుగూర్చిన విశేషములింకనెన్నోకలవు.

శిల్పనాచాతురి.

పోతన్నగారు తనకవితచిత్రికళాపరిదర్శనముకు పరమేశ్వరువలన దయచేయఁబడిన వరమనినమ్మినాఁడు. ఆయనది సహ

జపాండిత్యము. ఆయన ఆంధ్రభాగవతము నందలి పద్యములెల్లమనోహరశిల్పమున కుదాహరణములుగనున్నవి. భాగవతమునందలి కథాభాగములు, ఘట్టములు, చదివినను వినినను రసవంతములుగనుండి కన్నులకుఁ గట్టినట్లుండును, అందలి పాత్రములు సహజముగనుండి మనజీవితముల కాదర్శప్రాయములుగనున్నవి. జీవానుకరణము భావానుకరణము పోతన శిల్పమున గానవచ్చుచున్నవి.

గజేంద్రమోక్షమున భక్తుని మొఱవిని శ్రీకృష్ణుఁడు చెందిన తొందర, ఆపదవచ్చినవానికి సాహాయ్యము చేయఁ బోవువాని సహజమైనతొందర. ఆయన వెంటపోవు పరివారము పోతన చక్కఁగ చిత్రించినాడు. శ్రీకృష్ణుని మోహినీస్వరూపము, మనోహరచిత్రలేఖనము. దానివలన రాక్షసులందు కలిగిన చిత్తభ్రమ మద్భుతమైనను సహజమె. శ్రీకృష్ణుని చిత్తరువులను పోతన లేఖిని చాల చోటుల వ్రాసినది. శిశువుగ, బాలుఁడుగ, యువకుఁడుగ, వీరుఁడుగ, భగవంతుఁడుగ ననేకచోటుల కృష్ణుఁడు మనకు కనబడును. రుక్మిణీదేవి బాలికగ యువతిగ లక్ష్మీదేవిగ మనకన్నులయెదుటకనబడును.

ఆంధ్ర భాగవతమున ప్రకృతిసౌందర్య ప్రదర్శనము, స్వభావసామ్య నిరూపణమును చక్కఁగ నున్నవి. అందలి



సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు ఋతువర్ణనములద్భుతములు. శరద్రాత్రిని శ్రీకృష్ణుని మురళి గోపికల నాకర్షించిన విధముగనె పోతన కవిత మనల నాకర్షించును. అచ్చటి వర్ణనలు, సంబోధనలు, పద్యములు, రసవంతములై భావగీతులుగ నున్నవి.

మహాపురాణములందు భారతమునందుకల, తపోవన వర్ణనములకు భాగవతములోని వర్ణనములు తీసిపోవు. ఇందలి కణ్వాశ్రమ వర్ణన లలితముగ నున్నది. ఇందలి శరదృతు వర్ణనము మనోహరము. రాసక్రీడ యొక్క చిత్రశిల్పము.

పోతన్నగారు స్వభావసామ్యము నెంతో చక్కఁగ ప్రదర్శించెను. భక్తిని శృంగారమును కలిపిచెప్పిన చోటుల నిది కానవచ్చుచున్నది. ఇతరచోటులను బాగుగనె కనబడుచున్నది. ఉదాహరణమునకు రుక్మిణీ కల్యాణమున

"దేవకీసుతుకోర్కె తీగలువీడంగ వెలదికి మైతీగె వీడఁదొడఁగె
గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ గాంతికి ముఖకమలమొప్పె"

అను పద్యమును చూడుడు.

భాగవతమున రసపోషణము.

ఎట్లున్నది? ఈప్రశ్న వేయుట సాహసకృత్యము. చెఱుకునందు రసమెట్లున్నదని అడిగినట్లున్నది. భాగవతము నవరసములలోలుకుచుండును. అయిననిందు ప్రధానములగు రసములు

రెండు. మొదటిది శాంతి అనగా భక్తిరసము. రెండవది శృంగారరసము. ఈ రెండింటిని వేఱు వేఱుగ చిలికించి కవిత చెప్పినవారనేకు లాంధ్రమునఁ గలరు; కాని ఈ రెంటిని మంచిపాకమునగలిపి, ఆంధ్రలోకమునకుఁ గ్రొత్తరుచిని చూపినది పోతన హరిభక్తిని. మంచిపాకమున వేసిన పోతనశక్తి యద్భుతము. ఈకవి యేమి పలికినను, సహజముగ మొలచినట్లుండును. ఇతఁడు మంచి మృదుమధురభాషలో రసములొప్పునట్లు వర్ణించును. ఏసమయమునకుఁ దగిన మాటలా సమయమున పలుకును. హాస్యరసము మనభాషలో తక్కువయని పలుకువారికిఁ గడుపుబ్బనవ్వు పుట్టింప శ్రీకృష్ణుని బాల్యక్రీడను చదివి వినిపింపవచ్చును. కేవలశృంగారమె కావలెనను రసికులున్నచో అష్టమస్కంధమున మోహిన్యావతారఘట్టమును, దశమస్కంధమున గోపికాలీలలును చూపింపవచ్చును. వీరరౌద్రరసములు నృసింహావతారమున బాగుగ ప్రదర్శింపబడినవి. భీభత్సభయానకరసములు యుద్ధములందు బాగుగ నొప్పినవి. దీనికుదాహరణమునకు స్థాలీపులాకన్యాయమునకైన చూపెదమన్న గ్రంథవిస్తర భీతిసవిరమింప వలసివచ్చెను.

కవితావిశేషములు

భాగవతమున చాలకలవు. ఇద్ది మహాపురాణమైనను మహాప్రబంధలక్షణములగు,



“పురసింధునగర్తువనశైలసరసీవన మధురతి ప్రసంగ విరహముల్
పరిణయ యతనయోదయనయవిరచన యాత్రాజి ద్యూతవిభ”,

వర్ణనములు చితస్థలములలో కలవు. ఇవిచాల మనోహరముగ వర్ణింపబడినవి. కవిత్వతత్త్వవిచారము పెద్దలు చేయవలెనుగాని చిన్నవ్యాసకారులు చేయఁదలచుట వెఱ్ఱిపని. పోతన సహజకవిత మొత్తముమీద శాస్త్రానుసారముగనే యున్నదని పండితులయభిప్రాయము. ఇతఁడనేకవిధములగు నలంకారములను, శబ్దాలంకారములను ప్రయోగించినాఁడు. ఇతఁడంత్యప్రాస నియమమును విచ్చలవిడిగ వాడినాడు. ఇతనికవితలో శ్రవణసుఖమున్నది. ఈతని సంగీత మాధురీమహిమను పురాణముల చదివినవారును వినినవారు నెఱుఁగఁగలరు. ఈకవి వివిధములగు శ్లేషలను వెదజల్లినాడు. రసమొలుకు రచనలను కురిపించినాడు

మొదటనె పోతన వివిధరుచులుకలవారిని సంతోషపఱచెదనని

“కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱికిని సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱికి గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్”

అనిపలికి, ఆ ప్రతిజ్ఞను నెఱవేర్చికొనినాఁడు. పదలాలిత్యము అన్వయసౌలభ్యము, చిత్రాలంకారములు, ఉభయభాషాప్రౌఢిమయు నితని కవనమును మనోహరముగ చేసినవి.

అయిన నితని కవితలో కొన్ని దోషములున్నవని కొందఱనిరి. ఉభయరేఫ సాంకర్యదోషమున్నదని అప్పకవి యనినాడు. ఇది దోషమని ఇప్పుడెవ్వరుననరు. ఆంధ్రమునవిట్లు చెప్పువారు పలువురున్నారు. ఇదియైనను పోతనవ్రాసిన భాగవతములో లేదు. భాగవతము శిథిలమైనప్పుడు పూరించినకవుల కవనమునందే, ఈదోషము నితరదోషములు దొరలినవికాని పోతన కవితయందు తప్పులులేవని కొందఱు పలికిరి.

**పోతన కృతములను కొనబడునవి.**

ఇతరపుస్తకములు కొన్ని కలవు. వీనినెవరు రచించిరో చెప్పుటకష్టము. ఇందు మొదటిది వీరభద్రవిజయము. ఇది నాల్గాశ్వాసముల శైవప్రబంధము. ఇందు పోతనపేరే లేదు. ఒకవంశావళికల ప్రతినిమూచి కీర్తిశేషులగు వీరేశలింగము పంతులవారు భ్రమపడి మొదటనిది పోతనకృతమెయనినను, తమ యవసానకాలమునకుముందుగ వ్రాసిన వ్యాసమున నిది పొరపాటని గ్రహించి సవరించికొనిరి. ఆంధ్రులచరిత్ర వ్రాసిన వీరభద్రరావుగారు నిది పోతనది కాదనినారు.

రెండవది భోగినీదండకము. దీనినిగూర్చియు నిరుతెగలవారు పోరాడిరి. ఇందు పోతనరచించెననుకొనబడు పద్యము తుట్టతుదను కలదు.



"పండితకీర్తనీయుఁడగు బమ్మెరపోతనయార్యుఁ డాంధ్రమా
ర్తాండకులాచలాంబునిధి తారకమైవిలసిల్లభోగినీ దండకముఁ
రచించె బహుదానవిహార్తకు రావు సింగభూమండల
భర్తకు నవ్యమత మానవనాథ మదాపహర్తకున్,,

ఈదండకము కుమారాన్నపోతావనీనాథసూనుడగు సింగన వేశ్యను పొగడుచు, నతనికిఁ గృతియీయఁబడినది! "ఇమ్మనుజేశ్వరాధముల" నితిట్టుచు భాగవతమునుగృతినీయనొల్లని ఆత్మగౌరవముకల పోతన ఇట్లుచేసెనా? చేయునా? ఇదియునుగాక, ఈపద్యమైనను, దండకము చివర, "వాచంద్రతారార్కమై యొప్పుతన్" అని ముగిసినతరువాత నొకతోఁకవలె తగిలింపఁబడినది. కవనము పోతనదివలె నుండునట్లు తెలివితేటలు కలకవియెవ్వఁడైన నీదండకమును వ్రాసియుండవచ్చును. ఇట్టిదండకములెన్నో పూర్వముండి నశించినట్లు తెలియుచున్నది. ఇట్టి దండకమును పోతనపైఁ బగదీర్చికొనుటకు సింగనయె రచియింపించి యుండనేమో యనికూడ కొందఱియభిప్రాయము.

భోగినీదండకము పోతనదికాదనినవారిలో నొకరగు వాఙ్మయచరిత్రకారులె పోతన ఇంకొకకృతిని వ్రాసినాఁడనినారు. ఇది నారాయణ శతకము. ఇందలిపద్యము లాంధ్రదేశమున ప్రచారములో నున్నవి. కాని వీనికర్త యెవ్వఁడో తెలి

యము. కవిత్వము దోషభూయిష్టముగనున్నది. ఈ శతకపు వ్రాత ప్రతియొకదాని యందిటీవల వ్రాయబడిన గద్యను చూచి ఇది పోతనదగుకొని యుండునని కొందఱియభిప్రాయము.

ఇట్టి సందేహాస్పదములగు కృతులను విమర్శింపకయె, విడిచినచో మంచిదని తోచుచున్నది. ఈతళుకుబెళుకురాళ్లు లేకనె పోతనదివ్యరత్నము పురాణములలో పురాణమై మహాకావ్యములలో మహాకావ్యమై, ఆంధ్రవాఙ్మయమున ప్రకాశించుచున్నది.

వేమన కృతి విమర్శనము.

ఆంధ్రమున నీతి మతబోధకమగు శతక వాఙ్మయము మెండుగనున్నది. కవులు తమయిష్టదైవములను సంబోధించుచు నొక్కొక పద్యశతకమును చెప్పుచుండిరి. తత్వజ్ఞానమును బోధించు శతకములుకూడ కొన్నికలవు. మఱియు మానవులకుఁగల లోపములను పేర్కొని చూపుచు, దుర్గుణములను దూషించుచు, హాస్యరసప్రధానములై నీతిదాయకములగు శతకములును కలవు. కుక్కుటేశ్వరశతకాదులు పేరునకు దైవమును సంబోధించుచున్నను, ఆకాలపునాటి రాజకీయ, సాంఘిక మతస్థితులను గూర్చి విమర్శించి, ఆచా



రవ్యవహారముల దుస్థితియెన్నటికిఁ దీరునా యని విలపించు చున్నవి. వివిధ విషయములను, పదనీతులు, పదబూతులు, కలిపివిమర్శించి హాస్యరస ప్రధానముగ రచియింపబడిన శతకము, కవిచౌడప్ప శతకము ఇంకొన్ని చోటుల చాల మోటుగ నుండును. మన వేమనపద్యములిట్టి వివిధశతకములు కొన్ని కలిపిన సముదాయమువలెనుండును. ఇవికొన్ని వేలకుమించినవి. హాస్యరసప్రధానములై, ఆచారవ్యవహారములను ఖండించి నీతిమతజ్ఞానములను తత్వమును బోధించుచున్నవి.

వేమనకూడ తనకాలము నాటిస్థితిగతులను బాగుగ వెల్లడించినాఁడు. ఇతనికాలములో రాజకీయస్థితి బాగుగ లేనట్లు లితనిపద్యములె తెలుపుచున్నవి. "ఒకరినొకరుగొట్టి యొకరుబత్రింతురు" "ధనమెచ్చిన మదమెచ్చును" అనినాఁడు. "రాజవరులకెల్ల రణరంగములచింత" యని వీరొండొరులతోఁ బోరుచుంటను విమర్శించినాఁడు. అయిన నితఁడు అరాజకము నపేక్షింపఁడు. నృపతిలేక భూమితృప్తికాదట. ధర్మమే నృపులకుదారకంబని పలుకుచు, "అధికుఁడైన రాజు అల్పునిచేపట్ట వానిమాట చెల్లువసుధలోన" అని యేయమాత్యవరునో తిట్టుచున్నాడు. ఇతఁడు దుర్మార్గపరిపాలకుల నెట్లుహెచ్చరించుచున్నాడో చూడుడు:

"పెక్కుజనులఁ జంపి పేదలవధియించి డొక్క కొఱకు నాళ్లు దొంగలించి
ఏడదాగియున్న యెఱిగి యముడు చంపు ॥విశ్వ॥"

రాజుతుంటరియైనచో నతనికొలువును ప్రజలు నెట్లుందునో సూచించుచున్నాఁడు.

"ప్రభువుకోఁతియైన పెగ్గడల్ పందులు సైనికుండుపక్కి సేనవసులు
ఏన్గులశ్వచయము లెలుకలు పిల్లులు ॥విశ్వ॥"

ఈపద్యములెల్ల నెట్టిరాజకీయ స్థితిలో వ్రాయఁబడెనో కదా! ఇఁక సంఘముయొక్క ఆచారవ్యవహారములనుగూర్చి వేమన యేమనుచున్నాఁడో పరికింతము. ఇతఁడు సంఘదురాచారములను కఠినముగ విమర్శించుచున్నాఁడు. వర్ణాశ్రమధర్మములన్న నితనికిఁ గిట్టదు.

"అజ్ఞానమె శూద్రత్వము సుజ్ఞానము బ్రహ్మమౌట శ్రుతులనువినరా
అజ్ఞానముడిగి వాల్మికి సుజ్ఞానపు బ్రహ్మమొందె తెలియర వేమా,,"

"జాతులందు మిగులజాతి యేదెక్కువో ఎఱుకలేక తిరుగ నేమిఫలమని యడుగుచు "కులములేనివాడు కలిమిచే వెలయును, కలిమిలేనివాని కులముదిగు" నని పలుకుచున్నాఁడు.

ఇతఁడస్పృశ్యతా దోషమును తీవ్రముగ ఖండించినాడు. ఇతఁడు యోగియగుట సర్వజనులును సమానులెయని పలికినాఁడు:

"మాలవాని నేల మఱిమఱి నిందింప నొడలురక్తమాంస మొకటికాదె
వానిలోన మెలగు వానికులం బేది ॥వి॥,,



ఇతఁడు ప్రథమశాఖవారిని, వైశ్యులను, నంబివారిని, కంసలివారినికూడ తిట్టినాఁడు! ధనమూలమిదం జగత్తనులోకోక్తిని తఁడిట్లు చెప్పుచున్నాఁడు.

"ధనమెమూలము జగతికి ధనమెమూలంబు సర్వధర్మంబులకును,,

అని "పరగలేమిచేత బాదువుల్ పగవారలయినారని వగచుచున్నాఁడు. ఇట్టి యుదాహరణముల నితఁడెన్నిటినిచూపించినాఁడో కదా!

"కాపుబల్మియున్న గరణానికదిబల్మి కరణముబలమెల్ల కాపుబల్మి
కాపుసంతసంబు కరణముసంతోష మరసిచూడ లోకమందు వేమ॥

అని రెండర్థములతో నొకచోట పలికినాఁడు. ఇట్టివిపెక్కులు కలవు. ఇతనికి స్త్రీలన్న నభిమానము లేదు. "భార్యలుపోషించినన్నాళ్లు భూషించి తరువాత దూషింతు" రట. స్త్రీలను నమ్మరాదట. ఇతఁడు సంసారమును రోయుచున్నాఁడు.

"మానవునికి పూజకన్న బుద్ధినిధానము. మాటకన్న మనసుదృఢము. కులముకన్న గుణమె ప్రధానమని మాదిగవానికిగుణమున్నచో ద్విజుఁడగునని పలికినాడు. అయిన నిం కొకచోట నితఁడు.

"తిరుమలకుపోయిన తురకదాసరికాఁడు కాశికిపోయినను లంజ
మంచిదికాదు గోదావరికిపోయినను కుక్క సింహముకానేర,,

దని పలికినాడు. ఇట్టివిరుద్ధపుఁబలుకులు పెక్కులు కలవు. పాపపుణ్యములు మనసునుబట్టి యుండునని చెప్పి, దైవము చెడ్డవానిఁ జెఱచుననుచున్నాడు. ఇంకొకచోట దైవము మనల బొమ్మలనాడించినట్లు లాడించుచున్నాడనుచున్నాడు. ఇతఁడు వ్యభిచారమును తీవ్రముగ ఖండించి జారులను జారిణులను తిట్టినాడు. మనసు పవిత్రముగనుంచుకొనుట ముఖ్యమనియు, కాంతా కనకములమీది యాసవిడిచినగాని ఎన్ని తీర్థయాత్రలుచేసినను లాభములేదని నొక్కి పలుకుచున్నాడు.

వేమన మొదట వీరశైవుఁడని పద్యములవలననే తెలియుచున్నది. అయిన నితఁడు పరమవేదాంతి యైపోయి, జ్ఞానియై, తత్త్వజిజ్ఞాసచేసి, ఒక్కొకప్పుడు నాస్తికునివలెకూడ మాటలాడును. వివిధమతముల నధిక్షేపించుచు పరతత్త్వమును గొలుచుచుండెను. మతాచార వ్యవహారములనెల్ల దూషించినాడు. శైవమును వైష్ణవమునుగూడ సమానముగ ఖండించినాడు. ఇతఁడు విగ్రహారాధనమును నిరసించుచున్నాడు. ఇతని తత్త్వము చిత్రమైనది. మొదట శివునిగూర్చి భజించి, ఏకేశ్వరోపాసనముచేసి, తత్త్వజ్ఞానమున నాత్మారాధనములోనికిఁ దిగినాడు. ఇతఁడు కృత్యాదిని ఇట్లుపలికినాడు:

“శివకవులకు నవకవులకు శివభక్తికిఁ దత్త్వమునకుఁ జింతామణికిన్
శివలోకప్రమథులకును శివునకు గురువునకు శరణు సేయర వేమా,,



జ్ఞానము గాజుకుప్పెలోని దీపమువంటిదట. ఆత్మశుద్ధిలేని ఆచార మితనికనిష్టము. నమశ్శివాయయని నారాయణాయయని పలుకుదురేకాని దానధర్మములు చేయరని వగచుచు, జపమును బాహ్యపూజయుచేసియు, జనులుకపటము విడువలేక ముక్తినొందఁజాలకున్నారనియు, తత్త్వమెఱిగినవారికిఁ జింతయె లేదనియునితఁడు పలుకుచున్నాడు.

ఇతఁడు గురువు గురువని పొగడి వర్ణించి. తుదకు “గురువనగ పరమాత్ముఁడు శిష్యుఁడనగ బటుజీవుఁడవి,, తెలియఁజెప్పినాడు. తానెవ్వరు తనవారెవ్వరు చావనగనేమి? ఎల్లయు మిథ్యయని మాయావాదము సేయుచున్నాడు. మతమును గూర్చిన, ఇతని ముఖ్యాభిప్రాయమీ పద్యమునఁ జూడనగును.

“ఏకబ్రహ్మము నిత్యము వైకల్పికమైనయట్టి వస్తువులెల్లన్
ఏకత్వంబు నెఱింగిన శోకము లేకల్ల ముక్తిసులభము వేమా,,

వైష్ణవులనుగూర్చి యితఁడిట్లనినాడు:

“వైష్ణవులను నట్టిమాటయెకాని ప్రజలజెఱుతురయ్య
వాస్తవముగ ను,,

అయినను శైవుల నితఁడు మన్నించలేదు:

“శివునిభక్తులెల్ల భువిమంటిపాలైరి, పాదమేల దైవభావమేల?
విష్ణుభక్తులెల్ల వెలిబూడిపాలైరి ॥వి॥

ఇంకొకచోట నితఁడు సర్వమతములకు దేవుండొకఁడేయని

"శైవవైష్ణవాదిషణ్మతంబులకెల్ల దేవుఁడొక్కఁడనుచుఁ దెలియలేరు
తమకు భేదమయినతత్వంబు భేదమా ॥వి॥,,

ఇతఁడు దొంగవేషములు వేయువారినిగూర్చి యిట్లుపలికినాఁడు "బారెడేసిజడలు భస్మంపుబూతలు మరునితోడ మారుమలయుగలరు" అనియింకొకచోట "తలలుబోడులైన తలపులు బోడులా" యనికపటసన్యాసుల దిట్టుచున్నాఁడు. విగ్రహారాధనమితని కనిష్టము.

"శిలలఁజూచి నరులు శివుఁడని మెత్తురు శిలలు శిలలుగాని
శివుఁడు కాఁడు, తనదులోని శివుని తానేల తెలియఁడో ॥వి॥,,

అని ఆత్మశివలింగపూజ చేయుమని హెచ్చరించినాఁడు.

ఇతని కాచార వ్యవహారములందు. కర్మానుష్ఠానమునందు నమ్మకము లేదు.

"వ్రతములెన్నియైన వట్టిచిక్కులె కాని ఆత్మచిక్కుగాన నలవికాదు.
ఆత్మచిక్కు బాపునతఁడె ఘనయోగి॥వి॥,,
"ప్రేతయన్నమనుచు ప్రీతితోఁ పిలిపించి కాకులకును బెట్టుకర్మ
లార కాకులందునేమి ఘనులకుఁ బెట్టుడీ॥వి॥

ఇతనికి దెంతియసహ్యమో ఈపద్యమువలన తెలియుచున్నది.

"పిండములనుచేసి పితరులఁదలపోసి కాకులకును బెట్టు
గాడ్దెలారఁ!, పెంటఁదినెడు కాకి పితరు డెట్లాగయా॥వి॥



ఈకాలపు సంఘసంస్కర్తలలో నెవ్వఁడిట్లన సాహసించును? ఇతనికి తీర్థములందు నమ్మకమె లేదు.

"కాశికాశియనుచు కడువేడ్కతోఁ బోదురందుగలుగు దేవుఁడిం
దులేడె ఇందునంగఁగలడు హృదయంబు లెస్సైన॥వి॥

వేమననీతులు,

ఆంధ్రదేశమున నలుగడల బాగుగనెలకొనినవి. భాషయందు, మాటలలో, వ్రాతలలో, నివివిచ్చలవిడిగ నుపయోగింపఁ బడుచున్నవి. వేమనపద్యములు లౌకికన్యాయ బహుళములై, జనసామాన్యమున ప్రతిపురుషుని నోటను స్త్రీనోటను వినవచ్చుచుండును. సంస్కృతమున భర్తృహరిసుభాషితమువలె మనభాషలో నీనీతులు ప్రచారమునొందినవి. సాధారణగ నొకరైతుమాటలలో, గొల్లసుద్దులలో, వీధిభాగవతములలో, ప్రసిద్ధవాఙ్మయములలో, మధ్యమధ్య వేమననీతులు వినవచ్చుచుండును. మనముదినమున కొకమారైనను వేమననుస్మరింపకుండము. అతనినీతులువివిధములు. "నిక్కమైన మంచినీలమొక్కటిచాలు, అనువుగానిచోట నధికులమనరాదు; కొంచెముందుకొల్లకొదువకాదు; నెలవుదప్పినచోట నేర్పరికొఱగాదు; కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా; నిజములాడువాని నిందించు జగమెల్ల; మొదలుగాగలనీతులు వందలకొలది మనమువినుచున్నాము. ఇవిగాక సంపూర్ణప

ద్యాగులెన్నో వాడుకలోనున్నవి. ఉపమానప్రకారంబు నొక్క పోలికనుండునను పద్యము దినమున కెన్నిసారులు వినుచున్నామో! ఒకయూరనున్న వింకొకయూరిలో లేక, ఒకచోట నున్నట్టు లింకొకచోట లేక, ఎవరికితోచినట్లు వారుపలుకుచు, వివిధములగుమండల పదములతో వినవచ్చుచున్నవి. సామెతలవలె, లోకోక్తులవలె, నీతులవలె, ఉపమానములవలె నీపద్యములనుపయోగించుచున్నారు. ఇంతటిజనాదరణమునకుఁ బాత్రుడైనకవి యింకొకఁడులేఁడనుట యతిశయోక్తి కానేరదు. ఒక్కఁడేసుపుత్రుఁడింగన్న తండ్రిలాగున మన వేమన తనయొక్క కృతితోడనె కీర్తినిగడించినాడు.

వేమన హాస్యము.

వేమనకృతిలో రసపోషణము లేదని యెవ్వరు ననరు. తక్కినరసములెట్లున్నను హాస్యరసము ప్రధానముగ నున్నది. ఇతఁడు మతమునుగురించి, బ్రాహ్మణులనుగూర్చి, ఆచారవ్యవహారములనుగూర్చి, చేసినహాస్యమద్భుతము. ఇతని హాస్యమొక్కొకప్పుడు మృదువుగనుండక శ్రుతిఁదప్పుచుండును. కొంచెము మోటుగనుండును. అయిన నితని యెత్తిపొడుపులు వాడియగు బల్లెపుఁబోటులవలె నాటుకొనును. ఉదాహరణమునకుఁ గొన్ని పద్యములెత్తి చూపినఁజాలును.

“సమశివాయనవచ్చు నారాయణనవచ్చు, మేలువారినమ్మి మెచ్చవచ్చు
కొంగుపడచి కాసుగొబ్బునసీరాదు ॥వి॥”



అని రెండవపాదమున తేలుకొండివంటి యెత్తిపొడుపునుంచినాడు. ఇట్టి ప్రతిపద్యమున:

“అలిమాటలువిని యన్నదమ్ములఁబాసి వేఱుపడెడువాఁడు వెఱ్ఱివాడు
కుక్కతోకఁబట్టి గోదావరీదునా? ॥వి॥”

“కోమటోడినిష్ఠ గురికిరాదన్నడు లోభగుణముచేత లోనికడగు,”

“బారెడేసిజడలు భస్మంపుఁబూతలు మరునితోడమారుమలయగలరు
ముంజికోకలెల్ల లంజకోకలకారె ॥వి॥”

“కుక్కలుపవనంబు కొక్కెరధ్యానంబు, యతులనోసట నొసరనట్లు
వ్రాసె తొల్లిచేసినట్టి దోషంబుతగిలెనో ॥వి॥”

“పిండములనుచేసి పితరులఁదలపోసి కాకులకునుబెట్టు గాడ్దెలార
పెంటదినెడు కాకి పితరుఁడెట్లాగయా ॥వి॥”

ఇతని కాచారవ్యవహారములందు గౌరవము లేకపోయినఁ బోవుఁగాక శ్రుతులందు స్మృతులందు పురాణములందు పవిత్ర వాఙ్మయమునందు వేయేల చదువునందైనను గౌరవముకలదా? ఆవంతయైన లేదు.

“చదువురానికన్న చాకలితామేలు కులమువేల్పుకన్న కుక్కమేలు.
సర్వసురలకన్న సర్వేశ్వరుఁడుమేలు ॥వి॥”

“తన్ను దెలియకున్న తగవేదములువెఱ్ఱి సస్యసంపదకుముసాబువెఱ్ఱి
శాస్త్రసంచయంబు సర్వపురాణముల్ జబ్బులనుట జగతిచాటువేమ,”

ఇతడెంతటిధైర్యశాలి! ఇంతతోన్యూరకుండక

,,వెఱ్ఱినక్కలవలె వేదముల్జదివిన నాశయంబు లెఱుఁగర య్యవారు. వేదసారమెల్ల వేమనయెఱుఁగునని చాటుచున్నాడు. ఇదిచాలక వేదవిద్యలెల్ల వేశ్యలవంటివనసాహసించినాడు.

ఇఁక మహాభారతమును మనముపూజించు పాండవులను మాత్రము మన్నించెనా? చూడుఁడు ఎట్లునిందించెనో!

,,తాతజనించెకన్యకకు, తండ్రులుతాము గుండగోళకుల్
మాతపరానుకూలి మఱిమక్కువ ద్రౌపదిభర్త లేవురున్
నీతులఁజెప్పుపాండవుల నీమములిట్టివి యంచునెంచకన్
భూతలమందు మిక్కిలిగఁబూజలు చేసిరివెఱ్ఱివేమనా,,

వేమనజీవితచారిత్రమునకు

కొన్నినిదర్శనములు పద్యములలోనేకలవు. తనజన్మస్థానమునుగూర్చి, కులమునుగూర్చి, జీవితవిధానమునుగూర్చి యచ్చటచ్చట చెప్పికొనియున్నాడు. తనయూరినిగూర్చి

,,ఊరుకొండవీడు కునికిపశ్చిమవీధి మూగచింతపల్లె మొదటియిల్లు
ఎడ్డిరెడ్డి కులమదేమని దెల్పుదు విశ్వ॥,,

అనిపలికెనేమోయని యనుమానింపవచ్చును. పాపమతఁడెన్నోయూళ్లు తిరిగెను.

'ఆమడకామడకడవులం గ్రామంబులు చెఱువునదులు కర్మమునింతే
తానెందులోనఁదిరిగిన వేమనతోడగుచువచ్చు వెంటనె వేమా॥'

వివిధమాండలికపదములు దీనినె సూచించుచున్నవి.



వేమన్న తనకులమునుగూర్చి యిట్లుపలుకుచున్నాడు.

''కలియుగముననున్న కాపుకులానకు వేమనదనకీర్తి విక్రయించె
నున్నధర్మమెల్ల నుర్విపైనరులకు గోరుబెట్టు వరము గోరివేమ॥''

,,ఒరులకుభూమి నొరసేయువారును అవనిపతికి వశ్యులైనవారు నగు కాపుకులమును పాలవంటికులముగ వచించుట కులాభిమానమునుచూపుచున్నదని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు వ్రాసినారు. గుంటూరు నెల్లూరుదత్తమండలములలో కాపులు రెడ్లు పర్యాయపదములుగ వాడుచున్నారు. ఇతనుచేసిన ,,వేమనృపాలశేఖరా'' యను సంబోధనమువలన నితను ప్రభువంశములోని వాడాయని యనుమానము కలుగుచున్నది. 'పాకనాటి' రెడ్లకితడొకపద్యమున నగ్రస్థానమిచ్చుటచేతను, ఇతని నిర్యాణప్రదేశమగు కటారుపల్లెవారు పాకనాటికాపులమని వ్యవహరించుకొనుచుండుటచేతను, ఇతఁడాశాఖకుఁజెందినట్లు తలంపచ్చును. ఇట్లు పరిశీలించుచు పోవునయెడల వేమనయోగి జీవితచారిత్రము కొంతవఱకు తెలియనగును.

వేమనకాలమునాటి రాజకీయస్థితికిని కొన్నినిదర్శనములు కలవు. అతడుపుట్టినప్పటికి కొండవీటిసీమను పెదకోమటి వేమభూపాలుడు పాలించుచుండెనని కాలనిర్ణయమునఁదెలిసికొనుచున్నాము, కర్ణాటకసామ్రాజ్యమునకు దేవరాయలు (రెండవ హరిహరరాయల కొమరుడు) రాజు. రాచ వేమా

రెడ్డియనంతరము 1425వ సంవత్సరమునకు కొండవీడు పరుల పాలయ్యెను. 1435 నాటికి రాజమహేంద్రవరరాజ్యమును రెడ్డిరాజులు కోల్పోయిరి. మహాదాతలగు రెడ్ల దానధర్మములు, దేవాలయ ప్రతిష్ఠాపనములును వారిని రక్షింపలేదు, వేమన్న యిది చూచినాడు. ఇతనికి వైరాగ్యము కలిగినది. బ్రాహ్మణులు దుర్మార్గులై చెడిపోయినారని కోపమువచ్చినది. ఆకాలపు భైరవపూజలు, బలులు, చూచి అసహ్యపడినాడు. రాజకీయస్థితికి వగచినాడు.

"కాముకుఁడైనవాఁడు ధనకాంక్ష వహించినవాఁడు మిక్కిలిన్
పామరుఁడైనవాఁడు భువిపాలన సేయనివాఁడు మూర్ఖుడున్
మోమరసేయువాఁడు మతిముక్తిని గాంచునె యెన్నిభంగులన్
వేమనవాక్యమొక్కటియు వీసరఁబోవునె దారిఁదప్పినన్॥"

రాజమహేంద్రవరమును పీడించిన గజపతులపైనితనికి కోపముకలుగుట సహజమె! గ్రద్దవంటివాఁడు గజపతికాఁడొకో యని యొకచోటను, గజపతింటనెన్నగవ్వలుచెల్లవా,, యని ఇంకొకచోటను పలికినాడు.

వేమనజీవితవిధానము,

నాశయములును అచ్చటచ్చటసూచించినాడు.

"ఊరివారికెల్లనొక్కకంచము బెట్టి పొత్తుగుడిపి కులము పొలయఁజేసి
తలనుచెయ్యిపెట్టి తగనమ్మ చెప్పరా విశ్వ"



ఇది యితనియాశయము. తనజీవితవిధానమునుగూర్చి యితఁడిట్లు పలికినాడు.

"కూటికిలేనివానివలెఁ గోచములేకను నెల్లతావులన్
మాటికిమాటికిన్ మఱియు మాటకుమాటకుఁ బద్యపద్ధతిన్
ధాటినెలుంగ జెప్పుచును ధారుణిలో శివరూపధారియై
మాటికినున్న వేమన సమానము నెవ్వరు నుర్వి వేమనా॥"

ఇతడుసాధారణముగ మౌనముగనుండెడివాడు.

"పలుకమన్న నేలపలుకకయున్నావు, పలుకుమయ్య నాతో ప్రబల
ముగను పలుకుమయ్య నీదు పలుకు నేనెఱిఁగద విశ్వ॥"

ఇట్లుండి తనకిష్టమో, అవసరమో కలిగినపుడెల్ల పద్యములను చెప్పుచుండెడివారు. ఇతనిశిష్యులు వానిని వ్రాసికొనెడివారు. ఎప్పుడో యొకప్పుడితడు కవిస్తుతిని ఫలశ్రుతిని చెప్పినాడు. ఇతఁడు దిగంబరయోగిగ నుండెననుట కీక్రిందిపద్యములుపయోగించును.

"తల్లిగర్భమందుఁ దాబుట్టినప్పుడు మొదల లేదు బట్ట తుదను లేదు
నడుమ బట్టఁగట్ట నగుబాటుకాదొకో విశ్వ,,
"సిగ్గువిడువకున్న శివసౌఖ్యమును లేదు తగ్గ మొగ్గకున్న సిగ్గు విడదు
సిగ్గువిడుచువాడు చిరకాలజీవిరా విశ్వ,,
"సిగ్గువారలమని సృష్టిలోపలివారు వెఱ్ఱివేమనఁగని వెఱగుపడిరి
తనకుఁగల్గుసిగ్గు దైవమెఱుంగురా విశ్వ,,

ఇతడుచ్ఛిష్టము సేవగించుకొనక తినుచుండెను. తినమనుచుండెను.

"ఎంగిలెంగిలనుచు నీళ్లోటితో డవా వేదములనుజదువు
వెట్టులార ఎంచిచూడనదియు. ఎంగిలి కాదొకో! విశ్వ.,

"అన్నమునకు నంటుయయిన నాత్మకునంటు ఆత్మను పెనగొన్న యన్న
మంటు, ఆత్మశుద్ధి యన్నమన్నశుద్ధియు నాత్మమినుమన్నుమాడిక్కి మె
ఇయు వేమ.,

వేమన తనజీవితమున నెట్లుండెనో చూడుడు.

"పిలిచినఁబల్కకుండు మఱి పిల్చిననేమన కూరకుండు ధర్మ
దలచిన నెవ్వరేమనినఁ దన్నును గాదనినవ్వుచుండు నా
త్మలదలపోయుచుండు బరతత్త్వము నిత్యముఁదానయై సదా
తెలిసినయోగి వేమనగరిష్ఠ శివరూపుఁడెల్లకావులన్.,

"వినియు వినకయుండు వట్టివాఁడైయుండు కనియుఁగనకయుండు
కడగియోగి మనుజవరులచేత మఱిపూజఁగొనుచుండు ॥విశ్వ॥.,

ఇతనికి హేమకారవిద్య తెలియునో తెలియదో చెప్పలేము గాని, దానియందితనికి చాల నమ్మకమున్నదని తెలిసికొనవచ్చును.

"హేమకారవిద్య నెఱిగినవారెల్ల వెతలఁబడనియట్లు విద్యశ్రేత
ద్వమెలుగునెనుక తనకుఁ జింతేలగా ॥విశ్వ॥.,

"పరుసమినుముసోకి బంగారమైనట్లు.,

తాళకంబుఁదెచ్చి తాటికమ్మ రసానవంపు నిపుణ తెలుఁగ
వెండియగును కల్లగాదు నిజము కలకంఠనీయాన ॥విశ్వ॥.,

"నిమ్మపండుపుష్టి నిజమైనరసముండె హేమమునకు నేర్తురేల ప్రజలు
సత్తుపాత్తుఁజేసి సాధింపలేరొకో ॥విశ్వ॥.,



ఇతనికి వైద్యశాస్త్రమునగూడ పరీక్షకలదని తెలియఁజేయు పద్యములుకలవు.

"ఉక్కుశుద్ధిజేసి యుంచితినెదువాను ఉక్కుడిటువుకతోను
యుండుజగతి ఉక్కుమార్గముఁదినుటొప్పగు కల్పంబు ॥విశ్వ॥.,

"ఉక్కురసము చేర్చి యుదుటుగ సింధూరవారిదళముచేత
పాతముచేయఁగ రసవాదమదియె ధరకేయ లేరది ॥విశ్వ॥.,

ఇతనికి గణితసూత్రములుకూడ బాగుగఁదెలియును.

"ఒకటిక్రింద నొక్కటొవరుల బ్రహ్మ పెట్టి వలనుగా గుణింప
వరుసబెరుగునట్టి రీతియుండు నౌదార్యఫలములు ॥విశ్వ॥.,

ఇతనికి గొప్పగుణములు చాలకలవు. పరధనకాంక్షను కూడదనినాడు. దానధర్మములనుచేయుమనినాడు. అన్నదానముత్తమమనినాడు. పెద్దలయెడగౌరవముంచుమనును. తనమతమును విడువక ఇతరమతములను దూషింపకుండుట ముఖ్యమనును. ఇతని కఠినవిమర్శనమునకుఁ గారణమితడు దురాచారములను సహింపలేనివాడగుటె. ఇతనికిజంగమమతముపైనభిమానము.

వేమన్న కవిత:

నాల్గువేలకుమించిన పద్యములలో నన్ని వేమన వ్రాసి; ఎన్ని వికారపమునొందినవో, ఎన్నిటి నితరులు కల్పించినారో, అని తలంచినను, యిత్తమమీద వేమనకృతి చాల పెద్దదని తెల్లమగుచున్నది. ఇతనియభిప్రాయప్రకారము ॥రసాత్మకమ

కావ్యమనియెకాని యితర లాక్షణికులకువలె శబ్దాలంకార ధ్వని ప్రధానముకాదు.

"నిక్కమైన మంచినీలమొక్కటిచాలు, తళుకుబెళుకురాళ్లు తట్టెడేల
చదువపద్యమరయఁ జాలదా యొక్కటైన ॥విశ్వ॥"

కవులవర్ణనలనిట్లు నిందించినాడు

"చాలచనులుపూల బంతులఁబోల్తురు, పాలుమాలినట్టి భ్రష్టులవని
మాంసఖండమందు మఱియేమియున్నది ॥విశ్వ॥"

సత్కవుల నితడు పొగడినాడు

"కామిగానివాఁడు కవిగాఁడు రవిగాఁడు కామిగాక మోక్షకామికాడు
కామియైనవాఁడు కవియగు రవియగు ॥విశ్వ॥"

"రవికననిది కవియెఱుగును, కవియెఱుగనిచోట రవియు
నెఱుగదుధరలోరవికన్నమిగులవెక్కుడుకవియైవిలసిల్లునీవుగావలె వేమా"

"తోటకూరకైనను దొగ్గలికైనను, తవుటికుడుముకైన తవిటికైన
కావ్యములనుజెప్పు ఘనులెల్ల ధనపరుల్ ॥విశ్వ॥"

అని కుకవి నిందచేసినాడు.

వేమనకవిత జాతీయములతో, చక్కనిలోకోక్తులతో సులభములు సరళములునగు స్వరవర్గయతులతో ప్రాసములతో వ్యర్థపదములులేని పాదపూరణములతో, గొప్పయభిప్రాయములుకూడ నాడుకభాషలో చిన్నమాటలతో అనుభవైక వేద్యములును ప్రకృతిసిద్ధములునగు నుపమానములతో మంచినీటి ప్రవాహమువలె నున్నదనుట అతిశయోక్తికాదు.



వేమనయుపమ లెంతబాగుగనున్నవో చూచుటకు రెండు ఉదాహరణములు చూతము.

"ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు, చూడజూడ రుచులజాడవేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా ॥విశ్వ॥"

ఇందుకు రూపము రంగునకును విరుద్ధముగ, రుచి పరిమళము కీర్తియు ఎంతబాగుగ దుర్జనసజ్జనులలో నొప్పినవి! ఇట్లె

"గాజుకుప్పెలోన గడగుచు దీపంబదెట్టులుండు
తెలిసినట్టి వారిదేహంబులందును ॥విశ్వ॥"

మఱియు "కొండయద్దమందు కొంచెమైయుండదా" ఎంతప్రకృతిసిద్ధము! కొన్ని కావ్యప్రపంచములోని యుపమలుకలవు. "వెలయువనములోన మలయజంబున్నట్లు" మున్నగున వెన్నోకలవు.

వేమనకు భగవద్గీతలు శైవమతగ్రంథములు హితోపదేశము, పంచతంత్రము, భారతభాగవతములును గరతలామలకములు.

"అగ్రజన్మమునను నాహరిశ్చంద్రుండు ఆలిబిడ్డనమ్మియతడు
కూడ మాలవానికొలువు మతిలోకుడైయుండ ॥విశ్వ॥"

అని తనభారత కథాజ్ఞానమును చూపుచున్నాడు.

"చక్కనోటికడ నదిలోనిమీనుకై తిక్కపట్టి విడిచి మొక్కజాటై
ముక్కువైవగ్రద్ద మాంసమెత్తుకపోయె ॥విశ్వ॥"

అనిహితోపదేశము ననుకరించినాడు.

ఇతనికి పూర్వవేదాంతపరిచయము కలదు.

"పృథ్వియప్పునందు పుట్టెను గానుడీ అప్పుపుట్టె నగ్నినయందు జూడ
నగ్నివాయువందు వాయువాకసమున గల్గి చెలసె కానిత్రిమము వేమ"

ఇతఁడనేక సంస్కృతధర్మములను శ్లోకోక్తులను తెలుగుచేసి విప్పి చెప్పియున్నాఁడు.

వేమనయంతత్వార్థ బోధనములు,

పైకిఁగనఁబడు శబ్దము యర్థమొకటి స్పష్టముగ నుండును. భావముమాత్రము బాగుగ తెలియదు. దీనికెవరికితోఁచినట్లు వారు విప్పియర్థమును చెప్పుదురు.

కాయమీదమ్రానుఘనముగానుండును మ్రానుమీదతీగెమలయుచుండు
తీగమీదవ్రేళ్ళు త్రిపురీతాండవమాడు ॥విశ్వ॥,

ఈపద్యమునకర్థ మొకరిట్లువ్రాసిరి

"మనస్సునకు విజ్ఞానమును, విజ్ఞానమునకు ప్రకృతియు, కారణములై ఆప్రకృతియుఁను పరబ్రహ్మములీనమై తాండవమాడుచుండును."

ఇంకొకపద్యముఁజూడుఁడు.

"కృష్ణసర్పమందు కృత్తికలైదుండు కృత్తులైదుపట్టి కృష్ణమ్రింగ
నలయు కృష్ణలైదు వేమనమ్రింగెరా ॥విశ్వ॥,,



దీనికర్థము; అంధకారమయమగు గుహాలో నైదుతత్వములుండును. ఆయేనుంటిని మాయమ్రింగెను దానిని వేమన మ్రింగెను (నశింపజేసెను)

ఈక్రిందిపద్యమున కీక్రిందివిధమున వేదాంతు లర్థమున్నదందురు.

"చెప్పులోనిరాయి చెవులోనిజోరీగ కంటిలోనినలుసు కాలిముల్లు
యింటిలోనిపోరు యింతింతగాదయా ॥విశ్వ॥,,

దీనితాత్పర్యమును వంగూరి సుబ్బారావుగారిట్లువ్రాసినారు.

"నీపులోని (శరీరమునందలి) ఆయిపనంగాపరమాత్మను జెప్పుము చెవిలోనిపక్షిణవ నాదమునుజెప్పుము. నేనులోని (నాలోని) నలుసునవనగా బరమాత్మ కిరణలేశమును గనుగొంటిని (సంసారము) కాలిముల్లనిఁ గనుగొంటిని. ఈశరీరమను యింటిలోపోరు సంసారవైరాగ్యముల నడుమనెంతయో కలదు"

పద్యమకుటము.

విశ్వదాభిరామ వినురవేమ! యని సాధారణముగా బ్రతి యాటవెలదితుదను వచ్చును. లేదా "వేమనా!" "వేమా" "దేవరవేమా" తుదిపాదమునవచ్చును. కొన్నిపద్యములలో నిదిలేదు. కొన్నిప్రతులలో "విశ్వదాభిరాము" యనియు, "విశ్వ

ధాభిరామ," "విశ్వతోభిరామ" యనియు పాఠాంతరములు కలవు. ఇందలిస్వసంబోధనమును జూచి కొందఱిది వేమనకవి వేమన్నరెడ్డిరాజునుగూర్చి చెప్పెననియు కొందఱిది తనపేరు నభిరామయ్యయను తనగురువుపేరునగలిపి చెప్పెననిరి! ఈ మకుటమునకర్థము నేకులనేకవిధములుగ చెప్పుచున్నారు. బ్రౌనుదొరగారు Listen O Vema! dear to the Lord of all అనియర్థమువ్రాసిరి. అనంతకృష్ణశర్మగారు విశ్వతాభిరామయనుపాఠాంతరమును గ్రహించిప్రపంచత్వముచే నభిరాముడనిరి. అభిరామయ్యకథకాళ్ళులేనిది. వేమనతన్ను గూర్చి చెప్పుకొనెననుటకు కొన్నిపద్యముల నాల్గవపాదములను సందర్భానుసారముగ చూచినచో తెలియనగును. తనశిష్యులకు చెప్పినప్పుడహంకారము కనబడకుండునట్లు తన్నే సంబోధించికొనియుండును. ఇది జ్ఞానియగు వేమన్న అజ్ఞానియగు తనమనస్సుతో నీవేదాంతమును బోధించినట్లును మనకు తట్టుచున్నది. అని వంగూరు సుబ్బారావుగారనిరి.

పద్యములు—రచన.

నాల్గువేలకుమించినపద్యములలో రమారమి రెండువేల తొమ్మిదివందల యాటవెలదులు, ఆరువందలతొంబది తేటగీతములు, మూడువందల సీసములు, కొన్నిఉత్పలమాలలు, చంపకమాలలు, మత్తకోకిలలు, ఉత్సాహములు, చిత్రపద



ములునున్నవి. తత్త్వపదముకూడకలదు. ఇతనిపద్యములుసులభశైలిని జ్ఞానబోధకములై చక్కనిరచనలో నున్నవి. సీసమునకు శ్రీనాథచేమకూరలెట్లో, కందమునకు తిక్కన చౌడప్పలెట్లో వేమన యాటవెలది కట్టివాఁడు.

ఆంధ్రశతకవాఙ్మయమున వేమన

పేరుశాశ్వతముగ నగ్రస్థానమలంకరించినది. ఇతని కవితను, మేధాశక్తిని, తత్త్వబోధను నీతులను హాస్యరసమును మనవారే కాక పాశ్చాత్యులుకూడ పొగడియున్నారు. వేమన పద్యములను వేఱువేఱు శీర్షికలుగ నీతి మత సంఘ ధర్మ బోధకములుగ విభజించి చూచుకొనినచో, వేమనమనవాఙ్మయమున నెంతప్రాముఖ్యము జెందినాడో తెలిసికొనఁగలము. ఇతఁడు పలుకనిసంగతియే లేదు. ఇతడుగ్రీసుదేశపు లూషియన్ మహారాష్ట్రదేశపు తుకారామ్మున్నగు వేదాంత మహాకవులతో సమానుడు.

సమాప్తము.



# ఆంగ్లాయుర్వేదౌషధాలయం,

## బెజవాడ.

### డాక్టర్ జి. ఎస్. శర్మ,

[redacted]

**L. C. P. & S. (Cal.)**

లండన్నగరపు వైట్ కంపెనీవారి ఔషధములకు, మద్రాసు ఆంధ్రాయుర్వేద ఫార్మసీవారి ఔషధములకు, ఏజెన్సీ.

సమస్త ప్రాచ్య, పాశ్చాత్య, శాస్త్రీయౌషధములు సరసమగు ధరలకు అమ్మబడును.

ఇంగ్లీషు వైద్యశాస్త్రమునననుసరించి రోగములకు, చికిత్సచేయబడును. వైద్యవిషయమున సలహా యివ్వబడును.

మావద్దదొరకు,

| కొన్ని ఇంగ్లీషుమందులు. | కొన్ని ఆయుర్వేదౌషధములు. |
|---|---|
| కాడ్లివర్ ఆయిల్ | వసంత కుసుమాకరం |
| సారసపరిల్లా | సిద్ధ మకరధ్వజం |
| వాసన వెగటులేని ఆముదము | చ్యవనప్రాశము |
| గాంగ్లిసెరి(గనేరియా)మంచిమందు | అశోకవటి |
| | స్తన్యవర్ధకచూర్ణం |

వలయువారు పైఅడ్రసుకు వ్రాయుడు.

# శా[redacted] భాండార ముద్రాశాల,

## బెజవాడ.

బెజవాడ గవర్నరు పేటలో శ్రీరామమోహన పుస్తక భాండాగారము సమీపముననున్నది.

## తెలుగు, నాగరము, ఇంగ్లీషు

భాషలలో ముద్రణము బహురమ్యముగాను చవుకగాను జేసి త్వరలో యీయబడును. లెటరుపేపర్లు, శుభలేఖలు, ప్రకటన పత్రికలు, మొదలగునవి అచ్చుపనులు, బైండింగు పనులు అందముగా సకాలమునకు చేసి యివ్వబడును. వివరములు రేట్లు వగైరాలు తెలుసుకొనగోరువారు యీ క్రింద చిరునామాకు వ్రాయవలెను.

## ఇచ్చటదొరుకు గ్రంథములు.

### దేవీ భాగవతము

తెలుగులిపి గ్లేజుకాగితము, చక్కని బైండు సుందరమగు ముద్రణము శ్రీశ్రీ అంకితం వెంకటజగ్గారాయాస్థానపండిత పరిష్కృతము. వెల 2-8-0

### చాడీ వరివస్యా సర్వస్వము

ఫెదరువెయిటుకాగితము పైనముద్రితము దేవ్యుపాసకుల పాలిచింతామణి. శ్రీశ్రీ అంకితం వెంకటజగ్గారాయబహద్దరు వారి బహుపరిశ్రమచే ముద్రింపబడినది. అనేకమందిపండితులు మెచ్చుకొన్నది. వెల 2-8-0

ప్రొప్రయిటరు.

శారదా భాండార ముద్రాశాల, బెజవాడ.

# సాహితి



నూతన సాహితీశక్తికలను వెదజల్లు మాసపత్రిక, చక్కని కథలను, సొగసైన గీతములను, మంచిమంచి కవులు కర్తలు వ్రాయుచుందురు. సాహితి ప్రతిభాండారమునందును భాషాసేవకుని గృహమందును ఉండదగిన పత్రిక. మాసాహితీ పత్రికకు తెలుగుజిల్లాలలో మంచి ప్రచారమున్నది. దక్షిణ హైదరాబాదు రాష్ట్రములోకూడ దీనికివ్యాప్తికలదు. ఇదిమాసమునకొకసారి వెలువడును భాషా విషయకమగు మాసపత్రిక, తక్కినవార్తాపత్రికలవలె ఒకసారిచూచి చదివి పారవేయునది కాదు శాశ్వతముగా గ్రంథరూపమున నుండ తగినది. ఒకసారి తెప్పించిచూచిన మీకే తెలియగలదు.

కాబట్టి ప్రకటనలు పంపువారికిన్ని మంచిప్రయోజనము కలిగించును. ప్రకటనధరలకు యీదిగువ అడ్రసుకు వ్రాసిన తెలియగలదు.

సంవత్సర చందా రు 3—0—0 లు మాత్రము.

వలయువారు:—

మేనేజరు.

సాహితీ పత్రిక, బెజవాడ.



# ఫాహియాన్ భారతవర్ష యాత్ర.

గ్రంథకర్త:

వేలూరి సత్యనారాయణగారు, బి.ఏ.,

నాల్గవ శతాబ్దాంతమున—ఇప్పటికి పదునైదువందలేండ్ల క్రిందట, చీనా సామ్రాజ్యమునుండి భారతభూమిని సందర్శింపవచ్చిన "ఫాహియాన్" అను సుప్రసిద్ధ బౌద్ధసన్యాసుని యాత్రావృత్తాంతమిందు వర్ణింపబడినది. చంద్రగుప్త విక్రమార్కుడు రాజ్యమేలిన ప్రాచీనకాలమున భారతవర్ష మేతీరుగ నుండెనో, పరిపాలనావిధాన మేగతినడుచుచుండెనో, మతసాంఘికపరిస్థితులెట్లుండెనో పూర్వకాలమున భూవలయమున సువర్ణభూమియని పేరుమ్రోగిన భారతవర్షసౌభాగ్యమెట్లుండెనో, యిందు కన్నులకు గట్టినట్లు చిత్రింపబడినది. ఆరు దీర్ఘవత్సరములమిత శ్రమలఁబడి మహాభీలమగు గాలిదుమారములకాకరమగు రాదారులదాటి, యత్యున్నతములగు పర్వతావళుల నిర్గమించి, శరవేగమున బారు నదీప్రవాహములతరించి, యార్యావర్తమునకీ పాంథుడుగావించిన యాత్రావృత్తాంత మత్యంత విషాదపూరితమై, నవలవలె చదువగ లకెంపుగానుండును. ప్రాచీన భారత నాగరికతా సౌభాగ్యముల నరయఁగోరు ప్రతి యాంధ్రుడును, చదివి తీరవలయును. చరిత్రపరిశోధకుల కియ్యది యమూల్యమగు గ్రంథము. మృదుమధుర శైలిలో వ్రాయఁబడినది. ప్రపంచములోనికెల్ల నతిప్రాచీనమగు, బోధిద్రుమము, బౌద్ధమతావలంబులకుఁ గనుపవిత్రవంతములగు స్థూపములు, యానత్రయము, మున్నగు చిత్రపటములుగలవు.

మూల్యము 1 రూపాయ మాత్రమే.

వలయువారు.

విజ్ఞానచంద్రికా గ్రంథమండలి, బెజవాడ.

అని వ్రాయవలెను.

